శ్రీ లక్ష్మీనారాయణ గ్రంథమాల
కుసుమము 10

# దళవాయి రామప్పయ్య

(చరిత్రాత్మక నవల)

రచయిత :
చల్లా రాధాకృష్ణశర్మ, బి. ఏ.,
త్యాగరాయకళాశాల, మదరాసు.

సర్వస్వామ్య
సంకలితము

1953

మూల్యము
ఒకటిన్నర రూపాయ

# కృతజ్ఞత

నేను రచించిన యీ గ్రంథము విషయమై యాదృచ్ఛికముగా విని నిండు హృదయముతో దీని ముద్రణమున కగు వ్యయము నంతయు భరింప నంగీకరించి యిది వెలుఁగు లోనికి వచ్చుటకుఁ దోడ్పడిన ద్రవ్యదాతలు, సంఘసేవాతత్పరులు, సారస్వతప్రియులునగు **శ్రీ పోలంశెట్టి రామమూర్తిగారి** సహృదయతకు నా కృతజ్ఞత !

# అంకితము

మాతృశ్రీ

శ్రీ చల్లా యశోదమ్మగారి

దివ్యశ్రీచరణసరోజములకు

# మున్నుడి

ఆంధ్రులచరిత్రయందు మధుర నాయకరాజులచరిత్ర యొక మధురాధ్యాయము! మధుర నేలిన తెలుఁగు నాయకరాజులు బలసంపన్నులు, యశశ్శరీరులును. తెలుఁగు మాటకుఁ, దెలుఁగు పాటకు వీరికాలమున నొక క్రొత్త చెలువము, నొక క్రొత్త సోయగము చేకూడినవి. వీరు సాగించిన సమరములు, సాధించినవిజయములు ప్రశంసార్హములు. ఈ విజయములు సంస్కృతీవిజయగాథలు!

శిల్పము, చిత్రలేఖనము మున్నగు లలితకళలకుఁ బాదులు పెట్టి, నీరు పోసి పోషించిన మధుర నాయకరాజులు చరిత్రవినువీథిని ధ్రువతారలై ప్రతిభాసించుచున్నారు. వీరిలో విశ్వనాథ నాయనయ్య, ముద్దు తిరుమలశౌరి నాయనయ్య, రాణి మంగమ్మ, విజయరంగ చొక్కనాథ నాయనయ్య యనువారు సుప్రసిద్ధులు. వీ రెల్లరు మతసహిష్ణుతఁ బ్రదర్శించిన విశాలహృదయులు. ప్రజోపయోగార్థము సప్తసంతానముల నెలయించిన మహనీయులు. కళారాధకుల నాదరించినకళాపోషకులు.

ముద్దు తిరుమలేంద్రుని దళవాయి ప్రధానికము నెఱపుచుండి విశేష విఖ్యాతి సముపార్జించిన రామప్పయ్య యను తెలుఁగుమంత్రి జీవిత మిందలి యితివృత్తము. రాజకీయ విషయములతోఁబా టానాఁటి సాంఘిక వాతావరణమును గూడ దిఙ్మాత్రముగా నయినను జిత్రించుట కీ గ్రంథమునఁ బ్రయత్నము గావింపఁబడినది. ఈ గ్రంథరచనమునకు రెండేండ్ల పరిశ్రమ మవసర మయినది. ఆ పరిశ్రమముయొక్క విలువ గట్టుటకు సహృదయ పండితలోకము ప్రమాణము.

యిరువురు సేవకులు వెంట నడవ నొక వ్యక్తి యేతెంచి ప్రజను సమీపించెను. "మంత్రిగారు వచ్చియున్నారు. క్రొత్త విషయములు తెలియునేమో!" అని యుత్సాహభరితులయి యెవరికి వారు తమతమ మిత్రులతోఁ జెప్పుకొనఁ దొడఁగిరి.

ఆ యాగంతుకుఁడు మంత్రి రామప్పయ్య. అతఁడు విప్రవరేణ్యుఁ డని యతని యాకృతి సువ్యక్త మొనర్చుచుండెను. అంత పొడుగరి కాఁడు. కాని పొడుగునకుఁ దగినటుల లావుగ నుండుటచే కాఁబోలు పొడుగరిగా కన్పించును. చామనచాయ మేను. గంభీరమగుగుండ్రని మొగము. అరచేతి వెడల్పున నున్న నుదురు. చెవులకుఁ గుండలములు. అతఁడు కేవలము బుద్ధిబలము గలమంత్రి మాత్రమే యనుట యసమంజసము. మహాసాహసుఁ డగు యుద్ధవీరుఁడును.

శోకార్ణవములో మునిగియున్న పౌరులను గాంచినంతనే రామప్పయ్య నిలువున నీరయి పోయెను. ఏవో కొన్ని మాటలు నుడువ నభిలషించెను. కాని ప్రభుభక్తిపరాయణు లయిన మధురానగర వాసులను చూచుకొలఁది యతని దుఃఖము మఱింత యధిక మగుచుండెను. ఎటులనో శోకభారమును తగ్గించుకొని మంత్రి రామప్పయ్య గద్గదకంఠుఁడై మాటాడసాగెను.

"ప్రభుసేవాపరతంత్రు లయిన మధురపౌరులార!

మన ప్రభువులు శ్రీ శ్రీ ముద్దుకృష్ణప్ప నాయనయ్యగారు స్వర్గము నలంకరించి రని నుడువుటకు చాల చింతిల్లుచున్నాను. ఈ కర్ణకఠోర వార్తను మీకు తెలియఁజే

నందులకు నేను కృతజ్ఞుఁడను. ఇంకొక ముఖ్యవిషయమును మీకు మనవి చేసెదను. కీర్తిశేషులు ముద్దుకృష్ణప్ప నాయనిం వారి పారలౌకిక క్రియలు ముగిసినపిమ్మట—అనఁగా కొలఁది దినములలో—మన యువ రాజులుంగా రగు ముద్దువీరప్ప నాయనయ్య వారు సింహాపీఠి నలంకరింతురు. ముద్దువీరప్ప నాయని వారి ప్రతిభా విశేషములు మీ కెల్లరకు తెలియనివి కావు. ఎప్పటివలె నిఁకమీఁదగూడ మీ యందఱి సహకార సానుభూతులు పాండ్యమండలాధీశ్వరునికి సంప్రాప్తము లగు నని నేను విశ్వసించుచున్నాఁడను.”

మంత్రి రామప్పయ్య మాటలు ముగిసినతోడనే యట గుమిగూడియున్న జనసమూహమునుండి యొక వ్యక్తి వెలుపలికి వచ్చి మంత్రిని సమీపించి, ‘కీర్తిశరీరులు ముద్దుకృష్ణప్ప నాయనిం వారినిగూర్చి రెండుమాటలు నుడువ నేనభిలషించుచున్నాను. తమ రంగీకరింతురా?’ అని సవినయముగ నర్థించెను. మంత్రి యందులకు సంతసించి ‘అటులనే’ యని తన సమ్మతిని తెలుపునంతలో జనసమూహమునుండి ‘హిందూ మతమునకు మహోపద్రవము గలిగించుచున్న రాబర్టు డీనోబిలీ యీసందర్భమున మాటాడఁగూడదు. అతఁడు పాశ్చాత్యుఁడు. వంచకుఁడు—’ అను నినాదములు బయల్వెడలెను.

రామప్పయ్య రుద్రుఁ డయ్యెను. అతని కనులు చింత నిప్పులవలె నెఱ్ఱనయ్యెను. ఒడలు కంపించెను. కాని కోపమునకది తరుణము గాదని యెంచి కొంతవడి మిన్నకుండెను.

క్రోధాగ్ని చల్లారిన పిదప సహజగంభీరస్వరముతో నిట్లనెను. "మధురానగరవాసులార!

కోపమునకుఁ గాని నినాదములు చేయుటకుఁ గాని తరుణము గా దిది. ఉద్రిక్తులు కాకుఁడు. మన ప్రభువులు స్వర్గీయులు ముద్దుకృష్ణప్ప నాయనయ్యవారు జగ మెఱిఁగిన దైవభక్తులు. హైందవ దేవాలయములకు వారు కావించిన దానధర్మము లసంఖ్యాకములు. ప్రజోపయోగమునకై సత్రములు, గృహములు, చెఱువులు, బావులు మున్నగువాని నెన్నియో నిర్మించిరి. కాని వారు పరమతసహిష్ణుత గలవారు. ఈ మత సహనమే ముద్దుకృష్ణప్ప నాయనయ్యవారి జీవితమును ప్రకాశవంత మొనర్చినది. యావజ్జీవితము వారు పరమతావలంబకులను గౌరవించుచు వచ్చిరే కాని యిటుల హైందవేతరులను నిరసించి యుండలేదు. ఇట్టి ధీరగుణౌదార్య సంపన్నులగు ముద్దుకృష్ణప్ప నాయనింవారి భృత్యానుభృత్యులమయిన మనము క్రైస్తవ మత ప్రచారకుఁడగు ఈ రాబర్ట్ డీనోబిలీ మహాశయుని నిందించుట కేవలము తప్పిదముగా కన్పించుచున్నది. మన మీరీతి ప్రవర్తించిన పాండ్యమండలాధీశ్వరునకే కాక మధురానగర వాసుల మయిన మనకును దుష్కీర్తి లభింపఁగలదు. కాన మధురవారి పేరు పెంపులను సంరక్షించుటకైనను మీ రెల్లరు ప్రశాంతముగ నుండుఁడు. రాబర్ట్ డీనోబిలీని మాటాడ నిండు. అతఁడు పాశ్చాత్యుఁ డని వాకును తెలియును. అయినను నతని యభీష్టము దీర్చుట

మన కర్తవ్యము. మాటాడవలయు నని కుతూహల మున్నచో మీరును మాటాడుఁడు. అభ్యంతర మేమియును లేదు.''

రామప్పయ్య మాటలు వినినపిమ్మట ప్రజాసమూహము ప్రశాంతముగ నుండెను.

రాబర్ట్ డీనోబిలీ వేషభాషలను పురస్కరించుకొని యతఁడుపాశ్చాత్యుఁడని నుడువుట హాస్యాస్పదముగనుండును. అతని వ్యవహారనామము తత్వబోధస్వామి. అతని మేను తెల్లని తెలుపు. అచ్చటచ్చట గోధుమ వన్నెను మఱపించు నట్టి చిన్న చిన్న మచ్చలుకలవు. అతడు దీర్ఘకాయుఁడు. కాని మిక్కిలి పీలగా నుండుటచే నతని యాకృతి యాకర్షణీయముగా నుండదు. అయినను నతని యుత్సాహము, కార్యదక్షత, సంభాషణా చతురత్వము చూపఱ నాకర్షించుచుండును. అతని వేషము పాశ్చాత్యుల వేషధారణమునకు వ్యతిరేకముగ నుండెను. ముందు వెనుకలు బిళ్ళ మడతలు పెట్టి తెల్లని ధోవతిఁ గట్టెను. నడుమున నొక యంగవస్త్రమును బిగించెను. శరీరము పయిభాగమును నొక యెఱ్ఱని శాలువతోఁ గప్పివేసెను. మెడయందు రుద్రాక్షమాలతోపాటు వెండి సిలువనుగూడ ధరించియుండెను.

అంత నతఁడు రామప్పయ్యకును, మధురానగర వాసులకును రెండుచేతులు జోడించి సవినయముగ నమస్కరించి మాటాడ సాగెను.

"మహాశయులార!

తొలుదొలుత మన ప్రభువులు కీర్తిశేషులు శ్రీ శ్రీ ముద్దుకృష్ణప్ప నాయనయ్యవారి యాత్మకు శాంతి కలుగుగాక యని క్రీస్తుదేవునిహృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాను.

ఈ విషాదసందర్భమున మన కెల్లరకు తోడునీడగ సంచరించుచు వచ్చిన మన ప్రభువులవారి నిర్యాణమును గూర్చి నేను మాటాడ నభిలషించితిని. కాని నేను మాటాడుటకు నుద్యుక్తుఁడ నగుచుండగ మీలో కొందఱు రాబర్ట్ డీనోబిలీ నయవంచకుఁడు; పాశ్చాత్యుఁడని నినాదములు చేసి యున్నారు. నిజముగ నేను నయవంచకుఁడనే. నేటికిఁగూడ నేను రోమ్ దేశపు బ్రాహ్మణుఁడ ననియే మీలో చాలమంది భావించు చున్నారు. నా జన్మభూమి రోముదేశము. నేను ఇటలీ నగరవాసిని. కాని బ్రాహ్మణుఁడను మాత్రము గాను. అసలు మా సంఘమున వర్ణవ్యవస్థ యనునది లేనే లేదు. మధురానగరమునకు వచ్చినపిమ్మట నేను బ్రాహ్మణ వేషము ధరించి, బ్రాహ్మణాచార వ్యవహారముల నవగతము చేసికొని సంస్కృతాది భారత భాషల నభ్యసించి క్రైస్తవ మతప్రచారము చేయ నుపక్రమించితిని. నేను పన్నిన యీ పన్నుగడను తెలిసికొనలేక యగ్రవర్ణస్థులు సయితము క్రైస్తవ మతము స్వీకరించి నా కృషికి విజయము చేకూర్చిరి. వారికి నా ధన్యవాదములు. కాన నేను నయవంచకుఁడనే. తప్పని సరిగ నేను నయవంచకుఁడ నయితిని. తమ కెల్లరకుఁ దెలిసియే యుండును ఫర్నాండెస్ ఫాదరీ విషయము. అతఁడు పండ్రెండు

సంవత్సరములు మధురలో క్రైస్తవమత ప్రచారము గావిం చెను. కాని యెవ్వరును అతని ప్రచారమును సరకు సేయ లేదు. ఈ విషయమును జ్ఞప్తియం దుంచుకొనియే నేనీ క్రొత్త యెత్తు వేసి విజయము సాధించితిని.

ఈ యుపోద్ఘాత మంతయు ననవసరమని మీరు భావింతు రని నేను తలఁచుచున్నాను. కాని యిది యత్యావసరము. ఏల యన నేనిట్టివాఁడనని తెలిసియు మన ప్రభువులు ముద్దు కృష్ణప్ప నాయనింవారు నన్ను విశేషముగ గౌరవించి, మత ప్రచారము చేసికొనుటకు తమ యంగీకారమును తెలిపి యుండిరి. శ్రీవారి యాదరాభిమానముల వలననే నా కిచట నిలువ నీడ లభించినది. మధురమండలాధీశ్వరు లగు నాయక రాజు లందఱు పరమతసహిష్ణుత గల విశాలహృదయు లని నేను తెలిసికొంటిని. ఇట్టి మహోదార గుణసంపన్ను లగు వసుధేశ్వరులు మఱెచ్చటను నుండ రని నా విశ్వాసము. మా దేశమునందును మతసహనము, మతసహన మనుచు కొంద అనర్గళముగ రోజులతరబడిగా నుపన్యసింతురు. కాని యాచరణలో నయ్యది మృగ్యముగ నుండును. మనో వాక్కాయ కర్మలందు నిష్కల్మషు లగు నీ నాయకరాజుల యేలుబడిలో నున్న పాలితు లెల్లరు పుణ్యపురుషు లని నేనిపుడు తలఁచుచున్నాను. మఱొకతూరి ముద్దుకృష్ణప్ప నాయనయ్య వారి యాత్మకు శాంతి గలుగుగాక యని ప్రార్థించుచున్నాను.''

అటఁ గూడియున్న మధురానగర వాసులకే కాక మంత్రి రామప్పయ్యకుఁగూడ రాబర్ట్ డీనోబిలీ పలుకులు

సంభ్రమాశ్చర్యములు చేకూర్చెను. అతని ప్రగాఢమతాభిమానము, అకుంఠిత కార్యదీక్ష, పరభాషానురక్తి, వచోవిలాసము రామప్పయ్య హృదయమును జూఱగొనెను.

అప్పటికి హజారమునందు పదిగంటలు కొట్టిరి. అంతఃపురమున నొక టే కోలాహలముగ నుండెను. రోదనధ్వనులు ప్రస్ఫుటముగ వినవచ్చుచుండెను. ఎడనెడ నమంగళ వాద్యధ్వనులుకూడ వినబడుచుండెను. అంతలో రాజబంధువులు, అంతఃపురాంగనలు, రాజపురోహితులు, ప్రభుత్వోద్యోగులు, పురప్రముఖులు పలువురు రాచనగరునుండి విచారవదనులై యేతెంచుచుండిరి. వారి వెనుక నొక యాశ్వీక శకటము మెల్లగ వచ్చుచుండెను. అయ్యది బహువిచిత్రముగ నలంకృతమై యుండెను. ఆ శకటము మధ్యభాగమున నొక వేదిక యమర్పఁబడియుండెను. దానిపై పాండ్య మండలాధీశ్వరుఁడు, మేరు సమాన ధైర్య యశస్తిలకుఁడు నగు ముద్దుకృష్ణప్ప నాయనింవారి భౌతికశరీర ముంచబడెను. అతని వదనము చూపఱకు స్ఫుటముగ గోచర మగుటకుఁ గాఁబోలు మోము పయి నెట్టి యాచ్ఛాదనము గావింపఁబడలేదు. మిగిలిన శరీరమంతయు తెల్లని జిలుగు వల్కలముతోను, సువాసన లెగఁజిమ్ము సుమరాజములతోను కప్పఁబడియుండెను. ఆ యాశ్వీక శకటమున కిఱుప్రక్కల ముద్దుకృష్ణప్ప నాయనింవారి సతీతిలకములు, అంతఃపురస్త్రీలు నుండిరి. ముందుభాగమున నతని కుమారులు ముద్దువీరప్ప నాయనయ్య, ముద్దు తిరుమల

శౌరి నాయనయ్య, కుమారముద్దు నాయనయ్య, మంత్రులు, రాజపురోహితులు నుండిరి.

అంతఃపుర బహిర్ద్వారమున నా యాశ్విక శకటము చాలసేపు నిలిచియుండెను. మధురానగరవాసు లెల్లరు తమ ప్రభువును కడసారి దర్శించి బాష్పాంజలి సమర్పించిరి. మంత్రి రామప్పయ్య శకటమును సమీపించి యొక పూలమాలను ముద్దుకృష్ణప్ప నాయనయ్య శరీరముపై నుంచి వినయాంజలి ఘటించి మిన్నకుండెను. రాజబంధువులు, ప్రభుత్వోద్యోగులు శ్రద్ధాంజలి ఘటించిరి. పిమ్మట శకటము రుద్రభూమిఁ జేరెను. అట జరగవలసిన వైదికకర్మ లన్నియు సక్రమముగ నిర్వర్తింపఁబడెను. పాండ్యమండలాధీశ్వరుఁడు, సమయద్రోహర గండఁడు నగు ముద్దుకృష్ణప్ప నృపతికి దహన సంస్కారము గావింపఁబడెను. తదవసరమున నాతని సతీతిలకము లెల్లరు సహగమన మాచరించి కృతకృత్యు లయిరి.

ముద్దుకృష్ణప్ప నాయనింవారి నిర్యాణానంతరము మంత్రిమండలి యభీష్టానుసారము ముద్దువీరప్ప నాయనయ్య సింహాసనమునకు వచ్చెను. పట్టాభిషేక సందర్భమున తంజాపుర నాయకరాజు, తుండీర పరిపాలకుఁడు, మధురసామంత నృపాలు రనఁదగు డెబ్బదియిద్దరు పాళెగాడ్లు మున్నగు ప్రముఖు లెందఱో విచ్చేసియుండిరి. తమకుఁ దోఁచినరీతిని ముద్దువీర భూపాలుని సత్కరించి యతని యభ్యుదయమును గాంక్షించిరి. కవివర్గము శుభాకాంక్షలు తెలిపి ముద్దువీరప్ప నాయనయ్యసమ్మానము నందెను. ఆనాఁడు ప్రత్యేకముగ

మీనాక్షీసుందరేశ్వరుల యాలయమునం దభిషేకములు, పూజలు నిర్వర్తింపఁ బడెను. పాండ్యమండలాధీశ్వరుఁడు స్వయముగ సచివప్రవరులతోఁ గూడి కోవెలకుఁ జని, యట జగజ్జననీ జనకులను మనసార సేవించి యాలయాధికారులను నర్చకులను ఘనముగ సత్కరించెను.

ముద్దు తిరుమల శౌరివారు సోదరుఁ డగు ముద్దువీరప్ప నాయనయ్యకుఁ జేదోడువాదోడుగ సాయ మొనర్చుచు రాజ్య వ్యవహారములను స్వయముగ పర్యవేక్షించుచుండెను. నామకః ముద్దువీర భూపాలుఁడు రాజుగ వ్యవహరించుచుండెను. అట్లని సోదరునినగౌరవపఱచి కాని, అతనిని హతమార్చి సింహాసనము నాక్రమింపవలయు నని కాని తిరుమలశౌరి నాయనయ్య కల నైన తలఁచియుండలేదు. అగ్రజుఁ డనిన నంత గౌరవము తిరుమలశౌరి నాయనికి!

పదునాలుగు వత్సరములు రాజ్యపాలనము చేసి ముద్దు వీర భూపాలుఁడు దైవికము చెందెను. పిమ్మట తిరుమలశౌరి నాయనయ్య సింహాసనమునకు వచ్చెను. అతనికి రామప్పయ్య పైగల గౌరవాభిమానములు నిరుపమానములు. అతనిని తన ప్రధానామాత్యునిగ మాత్రమేకాక సైన్యాధ్యక్షునిగఁ (దళ వాయి) గూడఁ జేసి తిరుమలశౌరి నాయనింవారు రామప్పయ్య యెడ తనకుఁగల విశేషగౌరవమును సువ్యక్త మొనర్చెను. అనిర్వచనీయ మగుప్రతిభతో దళవాయి ప్రధానికమును నిర్వహించుచు నతఁడు పూర్వమువలె తిరుమలశౌరి నాయనిం వారి భృత్యుఁ డయి యుండెను.

## ౨

ఆనాఁడు దుర్గోత్సవము. ఈ యుత్సవమును విశేష వైభవముతో కొండాడుట విజయనగర సమ్రాట్టుల యాచారము. వారి సామంతు లగు మధురనాయక రాజులకును నయ్యది యాచార మయ్యెను. పాండ్యమండల మేలిన నాయక వంశజులలో ప్రథముఁడు, ప్రముఖుఁడు నగు విశ్వనాథ నాయనిం వారు పాండ్యమండలమునకు ససైన్యముగా తరలివచ్చునపుడు విజయనగరాధీశ్వరుని నర్థించి దుర్గావిగ్రహమును గూడ గ్రహించి మధుర మీనాక్షీసుందరేశ్వరుల యాలయమున దానిని ప్రతిష్ఠింపఁజేసెను. తదాదిగ విశ్వనాథ నాయనింవారి వంశస్థులు దుర్గోత్సవమును వైభవముగ కొండాడసాగిరి.

తదుత్సవనిమిత్తమై రాజసౌధము లన్నియు నెల్లవేయఁబడి మనోజ్ఞముగ నలంకరింపఁబడి యుండెను. ఏద్వారము నొద్దఁ జూచినను కన్నుల పండువు గొలుపు గెలలతో వ్రేలాడు నట్టి యరఁటికంబములునిలుపఁబడెను. కుడ్యములపయిముద్దులు మూటఁగట్టు చిత్రరాజములు చిత్రితము లయి యుండెను. అసలే రాజమందిరములు మహోన్నతములు. ఆ సౌధములమీఁద బంగరుపూఁత పూసిన పెద్ద గోపురములు నిర్మించి వానిపయి పతాకము లెగుర వేసిరి. సౌధోపరి భాగములం దున్న పతాకములుమారుతమునకు రెపరెపలాడుచు నేత్రోత్సవము గలిగించుచుండెను. ఉత్సవాలోకన కుతూహలముతో దూరస్థ గ్రామములనుండి కూడ పలువురు మధురకు విచ్చేసిరి. ఉత్సవ

మున పాల్గొనుటకు మాఱుగా రాజమందిరములను, నచట జరగువింతలు, వేడుకలు మున్నగువానిని నవలోకించి వారు సంతోషము చెందుచుండిరి.

దుర్గోత్సవమును పురస్కరించుకొని బంధువులు, మిత్రులు పలువురు దళవాయి రామప్పయ్య గృహమునకు విచ్చేసియుండిరి. దళవాయి స్వగ్రామము మధురానగరమున కేడుమైళ్లదూరముననున్న చతుర్వేదమంగలమను గ్రామము. అట నతని యగ్రజుఁడగు వైద్యనాథయ్య, అల్లుఁడు శివరామయ్య మున్నగు ముఖ్యబంధువులు నివసించుచు, పొలము బుట్రలఁ జూచుచుండిరి. వైద్యనాథయ్యకూడ పాండ్యమండల ప్రభుత్వోద్యోగిగా నున్నవాఁడే. కొన్నాళ్లు తిరుమలశౌరి నాయనింవారి కొలువులోఁ గూడ నుండెను. అన్న యనిన రామప్పయ్యకుఁగల గౌరవము నిరుపమానము. అన్నమాటను జవదాటి స్వతంత్రించి తమ్ముఁ డేపనిని చేయఁడు. తుదకు రణరంగములకుఁ జను సందర్భములందును సోదరుని యాశీర్వచనములతోపాటు సలహానుగూడ బడసి పిమ్మట స్వతంత్రముగఁ దా నాలోచించును. తమ్ముఁ డనిన వైద్యనాథయ్యకు నట్టి గౌరవమే.

ఒకనాఁటి సాయంసమయమున రామప్పయ్య శివరామయ్యను వెంట నిడికొని రాచనగరునకుఁ జనెను. శివరామయ్య పేరు గడించిన యుద్ధవీరుఁడు. అతనిని తిరుమలశౌరి నాయనింవారి కొలువులో దండనాథునిగ నియమింపవలయు నని దళవాయి యభిలాష. కాని పయికిమాత్రము తన యభి

లాపను వ్యక్తి మొనర్పెడు. అంతకుమున్ను రాజమందిరము లను శివరామయ్య చూచి యున్నను నాఁటి రాజసౌధము లతనికిసంభ్రమాశ్చర్యములు కలిగించెను. సౌధకుడ్యములపయి జిత్రితములయిన చిత్తరువులను చూచుచు నక్లే శివరామయ్య యొకచోట నిశ్చేష్టుఁడై నిలిచిపోయెను. అల్లుని కళాభిరుచిని గాంచి లోలోన సంతసించి, "ఈ చిత్రములను చూచి నిశ్చేష్టుఁడ వయితివి. పాండ్యమండలము నేలిన నాయకరాజుల చిత్రములు లోనఁగలవు. వానిని చూచిన నీ ప్రపంచము నే మఱతువేమో!" అని నవ్వుచు పలికి యతనిని దళవాయి రామప్పయ్య చిత్రశాలకు తీసికొని వెడలెను.

చిత్రశాలలో నడుగిడిన వెంటనే కోట్యము నాగమ నాయఁడు పంచపాండ్యులతో పోరాడి జయించిన విజయ గాథకు సంబంధించిన చిత్రరాజము దృగ్గోచర మగుచుండెను. "ఈ చిత్తరువును లెస్సగా పరికింపుము. మధురనాయక రాజ్యపాలకులలో విశేష విఖ్యాతి సముపార్జించిన విశ్వనాథ నాయనయ్యవారి తండ్రియే యిందు చిత్రింపఁబడినాఁడు. నాగమనాయనయ్య పరమ వైష్ణవభక్తుఁడు. యుద్ధవీరుఁడు. సేనా ధిపతి, కోశాధికారి, ప్రథమ కరగ్రాహి మున్నగు బాధ్యతాయు తములైన పదవులను నిర్వహించిన ప్రతిభాశాలి. ఈయన సాళువనరసింగరాయల కాలమునుండియు విజయనగరమువారి కొలువుకూటమున నుండెను." అనుచు దళవాయి వ్యాఖ్యా నము చేయసాగెను. శివరామయ్య యతని ననుసరించుచు చిత్తరువులఁ జూడఁజొచ్చెను.

ఆ చిత్రమునకు ప్రక్కనే ఆరుహాన్నిబ్బర గండఁ (డెబ్బదిరెండు పాళెములు జయించినవాడు) డనియశస్సు గడించిన విశ్వనాథ నాయనింవారి చిత్తరు వుండెను. దానినిచూచిన తోడనే దళవాయి యంజలి ఘటించి, "ఇతఁడు నిక్కముగ దైవాంశసంభూతుఁడే. ఆంధ్రభోజుఁ డని యఖండయశస్సును గడించిన సమ్రాట్టు శ్రీ కృష్ణదేవరాయలవారి ముఖ్యాశ్రితుఁడు విశ్వనాథ నాయఁడు. ఈయన చేసిన దానధర్మములసంఖ్యాకములు. నిర్మించిన యాలయములు మిక్కుటములు. తండ్రి సముపార్జించిన ధనరాసులనుగూడ పాండ్యమండలమునందలి దుర్గములు, నగరములు, ఆలయములు, సత్రములు—మున్నగువాని నెన్నియో పునరుద్ధరించుటకును, నిర్మించుటకును వ్యయ మొనర్చిన మహనీయుఁ డితఁడు. పూర్వము పాండ్య చోళమండలములు దుష్టమృగములతో నిండి యుండెడివి. ఎచట చూచినను దొంగలభయ మెక్కుడుగ నుండెను. గ్రామములు జనశూన్యము లయి యుండెను. దొంగల భయమును రూపుమాపియు, దుష్టమృగములను సంహరించియు గ్రామములను పునరుద్ధరించిన మహాత్ముఁడు. పాండ్యరాజుల కాలమున మీనాక్షీసుందరేశ్వరుల యాలయము నేఁటివలె మహోన్నతముగ, కళాఖండముగ నుండెడిది కాదు. ఆ కోవెలను పునరుద్ధరించియు, క్రొత్త నిర్మాణములు చేసియు విశ్వనాథనాయనయ్య చిరయశస్సు గడించెను—" అని నుడివి మఱొక పటమును జూపించెను.

"ఇదిగో దీనిని చూడుము. సింహళద్వీపములో సయితము తెనుఁగువీరులు తమ ప్రతిభా విశేషములు చూపి రని నీవును వినియుందువుగదా! ఈ విజయగాథ పెద కృష్ణప్ప నాయనింవారి కాలములో జరగినది. ఆ మహనీయునిదే యీ పటము. పాండ్యకుల స్థాపనాచార్య, దక్షిణ మహాసముద్రాధీశ్వర, సమయద్రోహరగండ, తిరువడిత్స్థాప మొదలగు బిరుదము లెన్నియో యితనికిఁ గలవు—" అని నుడివి యింకొక చిత్తరువును చూపించెను. అయ్యది పెదకృష్ణప్పనాయని కుమారుఁ డగు వీరప్పనాయనివారిది. "ఇతఁడు పరమ దైవ భక్తుఁడు. రాజ్యవ్యవహారములనుగూడ మంత్రుల యధీన మొనర్చి సతతము దైవకార్యములందే కాలము వెళ్ళఁబుచ్చిన భక్తవరేణ్యుఁడు. ప్రజారంజక పరిపాలకుఁడు. అయ్యావలీపుర వరాధీశ్వర, పాండ్యశ్రీ చేరచోలాది భూభృతాది బిరుదము లితనికిఁ గలవు. ఇతఁడు హిందూ మతాభిమాని యయ్యును పరమతసహిష్ణుత గలవాఁడు. ఇతని కాలముననే తొలిసారిగ ఫెర్నాండెస్ యను క్రైస్తవమతప్రచారకుఁడు మన రాజ్యమునకు వచ్చియుండెను. అతఁడు పండ్రెండు సంవత్సరములు మతప్రచారము గావించినను నొకఁడు కూడ క్రైస్తవమును స్వీకరింపలేదు" అని దానికి సమీపముగ నున్న పటమును చూపించెను.

"ఇది కుమారకృష్ణప్ప నాయనింవారి (రెండవ కృష్ణప్ప నాయనయ్య) చిత్రము. పాండ్య పార్థివ కృష్ణనృపతి యని యితఁడు ఖ్యాతి గడించెను." అని నుడివి దళవాయి రామ

ప్పయ్య మఱొక పటమును జూపుచు కన్నుల నీరునించెను. కొంతతడ వతఁడు మాటాడలేక పోయెను. గద్గదకంఠుఁడై దళవాయి 'శివరామయ్యా! యీ పటమును దీక్షగా చూడుము. ఆ నల్లని మీసములను, తట్టతలపాగను గమనింపుము. ఆకారములో నతఁడు నలుపే యైనను నతని హృత్సీమలో తెల్లని తెలుపుతప్ప మఱేమియు కన్పింపదు. ఈ మహనీయుఁ డెవరో తెలియునా ? మధురనాయక రాజుల చరిత్ర యారంభ మయిన నాఁటనుండి నలుబది వత్సరములు నిరాఘాటముగ దళవాయి ప్రధానికమును నిర్వహించిన ప్రతిభాశాలి. అరియనాథ మొదలి. నాగమనాయనింవారి ముఖ్యాశ్రితుఁడు. కాంచీపుర నివాసి. తొలుత బీదఱికము ననుభవించి, స్వయంకృషిచే పిమ్మట వృద్ధికి వచ్చి చిరయశస్సు గడించిన కష్టజీవి. నీవు చూచితివో లేదో-సుందరేశ్వరాలయమునఁ గల వేయికాళ్ళ మండపమును నీతఁడే నిర్మించెను. ఇతని శిలావిగ్రహము గూడ నటఁ గలదు. దానిని తప్పక చూడుము. అరియనాథ మొదలిని నాదర్శపురుషునిగాఁ జేసికొని నీవును వృద్ధికి రమ్ము' అని నుడివి అరియనాథ మొదలికి శ్రద్ధాంజలి సమర్పించెను.

అటుపిమ్మట ముద్దుకృష్ణప్ప నాయనింవారి పటమును చూపించుచు "ఈయనయే మన ప్రభువులు ముద్దు తిరుమల శౌరి నాయనయ్యవారి తండ్రి. వీరికాలముననే రాబర్ట్ డీనో బిలీ మన దేశమునకు వచ్చియుండె"నని దళవాయి పలుకు చుండగ, 'ఆ సయపంచకుఁ డింకను మీ స్మృతిపథమున

నున్నాఁడా?' అని యుద్రేకపూరితముగ శివరామయ్య మామ గారి నడిగెను.

అందులకు నవ్వుచు 'నాయనా! నీవంటి యువకుల యుద్రేకము పాలపొంగు వంటిది. ఉద్రేకమునకు వశుఁడవై యవ్యక్తుఁడవు కాకుము. రాబర్టు డీనోబిలీ మహా మేధావి. పాశ్చాత్యుఁడయ్యును సంస్కృతాది భారత భాషల నేర్చిన ఘటికుఁడు. అతని మత ప్రచారము విజయవంతముగ క్రొత్త యెత్తు వేసెను. అట్లనర్చుట గొప్పదనా! కార్య దక్షత యన నతనిది కాని యితరులది కాదు-' అని పలికి దళవాయి సమర్థించెను. కాని శివరామయ్యకు తృప్తి కలుగలేదు.

ఇట్లు మాటాడుకొనుచు వా రిరువురు చిత్రశాల యం దున్న చిత్రపటముల నన్నిటిని తిలకించిరి. మఱొకసారి పటము లన్నిటిని కలయఁజూచి "ఈ చిత్రము లన్నియు నొక యెత్తు. ప్రకృతము మన ప్రభువులు తిరుమలశౌరి నాయనిం వారు నిర్మించుచున్న సుందరమహాలు నందలి చిత్రకళా సంపద యొక యెత్తు. ఆ మహాలును మఱొకప్పుడు దర్శింత" మని నుడివి దళవాయి రామప్పయ్య శివరామయ్యను తీసికొని తిరుమలేంద్రుని కొలువుకూటమునకుఁ జనెను.

అప్పటికే తిరుమలశౌరి నాయనయ్య కొలువుకూటమునకు విచ్చేసియుండి దళవాయి ప్రధాని రాకకై నిరీక్షించుచుండెను. అతఁడు వచ్చుచున్నాఁడని తెలిసికొని దళవాయిని లోనికిఁ గొని తెచ్చుటకై తన యంగరక్షకులను పంపెను.

తిరుమలశౌరి నాయనింవారికి నమస్కరించి రామప్పయ్యయు, శివరామయ్యయు నుచితాసనముల నలంకరించిరి.

తిరుమలుఁ డంతకుము న్నొకప్పుడు శివరామయ్యను రణరంగమునందు చూచియుండెను. ఈ విషయమును జ్ఞప్తికి తెచ్చుకొని 'ఈ యువకుఁ' డెవ రని యాతఁడు ప్రశ్నించెను. 'ఇతఁడు నాఅల్లుడు. ప్రకృతము మా స్వగ్రామమందే మా అన్నగారియింట నివసించుచున్నాఁడు–' అని దళవాయి బదులిడెను. కొంతవడి మిన్నకుండి చిఱునగవుతో, 'దళవాయి ప్రధానిగారికి దళవాయియే అల్లుఁడగుట లెస్సగా నున్న'దని తిరుమలశౌరి ఛలోక్తిగ ననెను. అందులకు దళవాయి నవ్వి యూరకుండెను.

పిమ్మట తిరుమలేంద్రుఁడును రామప్పయ్యయు రహస్య మందిరమునకుఁ జని యటఁ జాలసేపు రాచకార్యములను చర్చించిరి. అంతలో నొక ద్వారికుఁడు భయభ్రాంతుఁడగుచు కొలువుకూటమునకు వచ్చెను. ప్రభువుల రాకకై యతఁడు చాలసేపు నిరీక్షించెను. ఎంతసేపటికిని నతఁడు రాక పోవుటచే నా ద్వారికుఁడే స్వయముగ రహస్య మందిరమునకుఁ జన నుద్యుక్తుఁ డయ్యెను. రహస్య మందిరమును నితరు లెవ్వరును సమీపింపరా దనుచుశి వరామయ్య యతనిని వారించుచుండఁగా, తిరుమలశౌరి నాయఁడు రామప్పయ్యతోఁ గూడి కొలువుకూటమున కేతెంచుచుండెను. ద్వారికుని దీనవదనమును గాంచి కలతఁ జెంది దళవాయి యతనిని సమీపించి 'యేమి సంభవించెనో తొందరగ నుడువు'మని కోరెను.

"ప్రభువులకు జయ" మనుచు మొదలిడి యతఁడేదియో చెప్ప నారంభించెను. అంతలో మఱియొక దౌవారికుఁడు ప్రవేశించి ప్రభువులకు జయ మని పలికి యూరకుండెను.

'శత్రురాజు లెవరయిన మనదేశముపై దండెత్తిరా యేమి?' అని కొంచెము విసుగుతో తిరుమలశౌరి నాయనయ్య వారిని ప్రశ్నించెను. 'అవును ప్రభూ - దిండుగల్లు కోటను మైసూరు దళవాయి నంజరాజు ముట్టడించె నని దిండుగల్లు పాళెగాఁడు రంగన్న నాయఁడు తమకుఁ దెలియఁజేయ వలసినదిగ సెలవిచ్చినాఁడు-' అని మొదటి దౌవారికుఁ డనెను.

'మైసూరివారికి గుణపాఠము నేర్పవలసి యున్నది. దిండుగల్లు దుర్గమునే నంజరాజు ముట్టడించెనుగా! ఏమి యతని కండకావరము!' అనుచు తిరుమలశౌరి కనులెఱ్ఱఁ జేసెను. దౌవారికులను పొమ్మని యాజ్ఞాపించి దళవాయి రామప్పయ్య, 'తమ యాజ్ఞ యైనచో రంగన్న నాయనికి సహాయముగ నేను యుద్ధములో పాల్గొందును. నంజరాజును ప్రతిఘటించి యతనిని శిక్షింపవలయు ననియే నా యభిమతము' అనెను.

'అటులనే తమ యిష్టము-' అని కొంతతడవు మిన్నకుండి, 'ఱేపే ససైన్యముగ మీరు దిండుగల్లు కోటకుఁ జనుట శ్రేయస్కర మేమో' అని తిరుమలశౌరి నాయఁడు తన యభిమతమును వ్యక్త మొనర్చెను. 'నా యభిమతమును అదే' యనుచు నతనియొద్ద సెలవు తీసికొని, అల్లునితోఁ గూడి రామప్పయ్య గృహాభిముఖుఁ డయ్యెను.

హజారమున ఏడు గంటలు కొట్టిరి.

మధురానగరము వైఘనదీ తీరమున నుండుటచే సాయంసమయ మయినం జాలు, నగరమున కమ్మని చల్లగాలి మెల మెల్లన వీచుచుండును. నగరము నావరించి యరంటి తోటలు, తమలపాకులతోటలు, పుష్పోద్యానములు నెన్ని యో కలవు. కమ్మని పిల్ల తెమ్మెర లా తోటల మీఁదుగా నగరమున ప్రవేశించును. వేసవియందును ప్రొద్దు తిరుగుసరికి చల్లనిగాలి వీవ నారంభించును. అదియునుగాక నగరవీధులు సువిశాలములు; సుదీర్ఘములు. ఒకదానిపయి నొకటి యానుకొని యుండక గృహములు కొంచె మెడమెడముగా నుండును. ప్రతి యింటికి ముందుభాగమున పూలమొక్క లుండును. మధురానగరవాసులు పుష్పప్రియులు. దైవము నర్చించుటకు తప్పనిసరిగ వారికి సుమములు కావలయును. మధురయందుఁ గల గుడిగోపురములలో ముఖ్యముగ నుడువఁదగినది మీనాక్షీ సుందరేశ్వరుల యాలయము. ఆ కోవెలలో త్రికాలము లందును యథావిధిగా పూజ పురస్కారములు జరగుచుండును. ధూపదీప నైవేద్యాదులయం దేవిధమయిన లోపము జరగ రా దని పాండ్యమండలాధీశ్వరుల శాసనము. దైవకార్యములు నిరాటంకముగా జరుగుటకై వారు కోవెలకు గ్రామము లనేకములు వ్రాసియుండిరి. ఆనాఁడు దుర్గోత్సవము కాన మీనాక్షీసుందరేశ్వరుల యాలయము ముముక్షువులతో క్రిక్కిఱిసియుండెను. గుడిలోపల భజనలు, విప్రవరేణ్యులు వేదపఠనము, హరికథాకాలక్షేపములు జరగుచుండెను.

సాధారణముగ ప్రతిదినము కోవెలకుఁ జని దేవుని దర్శించి వచ్చుట దళవాయి రామప్పయ్యకు నిత్యవిహిత కర్మలలో నొకటి. అందులోను రణరంగమునకు వెడలుటకుమున్ను మీనాక్షీసుందరేశ్వరులను దర్శించి యథావిధిగ నభిషేకాదికము నొనర్చుట యతని కలవాటు. అట్లొనర్చిన సంగ్రామమున జయము లభ్యమగు నని యతని ప్రగాఢవిశ్వాసము. రామప్పయ్య ఆలయమునకుఁ జని యర్చనాదికము జరపి, పిమ్మట నాలయాధికారులతోఁ గూడి సుందరేశ్వరాలయమునకు సమీపమున నిర్మిత మగుచున్న సుందరమందిరమును దర్శింపఁ జనెను. అది కళాప్రియుఁడు, కళాపోషకుఁడు నగు తిరుమలశౌరి నాయని పేరున నిర్మిత మగుచున్న మందిరము. ఆ సుందరమందిరమును తనివితీరఁ జూచి రామప్పయ్య యందలి కళావైదగ్ధ్యమును వేనోళ్ళ పొగడెను. వెంట నున్న శివరామయ్య కేవలము పరవశుఁడయి శిల్పాచార్యుల పనితనమును పలువిధముల ప్రశంసించెను. అనంతరము దైవప్రసాదమును స్వీకరించి వా రిరువురును గృహాభిముఖు లయిరి.

దిండుగల్లు దుర్గమును మైసూరు దళవాయి సంజరాజు ముట్టడించె ననియు, నతనిని ప్రతిఘటించుటకు దళవాయి ప్రధాని రామప్పయ్య ససైన్యముగ దిండుగల్లునకు నరుగనున్నాఁ డనునట్టి వార్తలు తామర తంపరవలె నగరమున ప్రాకిపోయెను. ఈ విషయాదికము వైద్యనాథయ్యకుఁ గూడ తెలిసెను. రణరంగమునకు రామప్పయ్య చనుట క్రొత్త కాకున్నను ఆనాఁడు మాత్రము వైద్యనాథయ్య కొంచెము

విచారించెను. కారణమేమో దురూహ్యము. తమ్ముని రాకకై యతఁడు చాలసేపు నిరీక్షించెను. ఎంతసేపటికిని నతఁడు రాకపోవుటచే వైద్యనాథయ్య భోజనముచేసి, సుందరోద్యానమున నటు నిటు పచారులు చేయుచుండెను. యతని హృదయము పరాయత్తమై యుండెను. అంతలో రామప్పయ్య గృహమున కేతెంచెను. వైద్యనాథయ్య యతని కెదురుగాఁ బోయి లోనికిఁ గొనివచ్చి యుద్ధవిషయమై ప్రస్తావించెను. ఉచితరీతిని దళవాయి బదులిడెను. కాని వైద్యనాథయ్య మోమున సంతోషచ్ఛాయ లేవియు నగపడని హేతువుచే విచారముగ నున్నావే మని రామప్పయ్య ప్రశ్నించెను.

కొంతవడి మిన్నకుండి 'తేపే వెళ్లవలయునా?' అని వైద్యనాథయ్య యడిగెను.

'ఈవేళకు నంజరాజు దిండుగల్లును ముట్టడించి యుండును. అచట మన పక్షమున రంగన్ననాయఁడు తప్ప మఱెవ్వరును పోరాడుటకు లేరు. కనుక అతనికి సాహాయ్యముగ నేను బోవలయునుగదా! అదియునుగాక తేపే దిండుగల్లునకు నరుగవలయునని రాజాజ్ఞకూడ నైనది-' అని రామప్పయ్య యనుచుండఁగ, 'నీవు పోవుటలో నాకెట్టి యభ్యంతరమును లేదు. జయశ్రీ నిన్ను వరించు ననియే నా దృఢవిశ్వాసము. అయినను నా మన మెందులకో సంశయించుచున్నది' అనుచు వైద్యనాథయ్య కన్నుల నీరు నించెను.

అప్రయత్నముగ వైద్యనాథయ్య మరల నిట్లనెను.

'నీవును శివరామయ్యయు రాచనగరునకుఁ జనినపిమ్మట కొంతసేపటికి నేనును అంతఃపురమునకు బయలువెడలితిని

మధ్యేమార్గమున నా బాల్యమిత్రుఁ డొకనిని కలిసికొంటిని. అతఁడు నన్ను తన యింటికి తీసికొని వెళ్లెను. ఆ యింటి యరుగుపై నలుగురు కూర్చుండియుండిరి. నన్ను చూచిన దే తడవుగ 'ఇతఁడే రామప్పయ్య సోదరుఁడు. మన మాటల సందర్భముననే యీ శనిగ్రహము దాపురించినది-' అనుచు లేచిపోయిరి. వారి మాటలు వినిన మఱుక్షణము నుండియు ని కేమి విపత్తు సంభవించునో యని కుందుచున్నాను.'

కొంతవడి యాలోచనా నిమగ్నుఁ డయి రామప్పయ్యగంభీ రముగ, 'ఇంతమాత్రముననే మీరు దిగులు చెందవలదు. నా విరోధు లెవరో నాకు తెలియును. ప్రస్తుతము వారిపై పగసాధిం చుట యుత్తమముగాదని తగిన తరుణమునకై వేచియున్నాను. రాజ్యాధికారము నా హస్తగతమై యున్న దనియు, సామాన్య కుటుంబికుఁడ నగు నేను ప్రముఖస్థానము నాక్రమించితిననియు నా విరోధులు మిక్కిలి బాధఁ జెందుచున్నారు. దళవాయి పదవినుండి విరమించుకొని విశ్రాంతి పొందవలయు నని నే నభిలషించుచున్నాను. కాని తిరుమలశౌరి నాయనింవారి మాటను తీసివేయఁజాలక యింకను కొలువులో నున్నాను-' అని విన్నవించెను.

రామప్పయ్య మాటలు వైద్యనాథయ్యకు మనశ్శాంతి కలిగించెను. అతని హృదంతరాళములో దాగియున్న యపో హలు, సంశయములును మబ్బువీడిన రీతిగా తొలఁగిపోయెను. అప్పటికే కాలాతీత మయిన దని నుడివి తమ్ముని భోజనము నకు పొమ్మని చెప్పి వైద్యనాథయ్య తన శయనాగారమునకు వెడలెను.

# 3

ఆరుహన్నిబ్బర గండఁ డని యఖండయశస్సు గడించిన విశ్వనాథ నాయనయ్య ప్రప్రథమముగ పాండ్యమండలమును దర్శించినపుడు రాజ్యము దుష్టమృగాళికి విహారభూమియై యుండెను. వాతావరణము కలుషిత మయి యుండెను. శాంతి భద్రతలు స్వప్నగత వృత్తాంతములుగ నుండెను. ఎచట చూచినను బందిపోటు దొంగలు స్వైరవిహారము సలుపు చుండిరి. వారివలని భయముచే పగటివేళలందును గ్రామము లందలి వీధులు నిర్మానుష్యములై యుండెడివి. దుష్ట మృగ ములు వచ్చి యెచట మీఁది కుఱుకునో యనుభయముచే తమ గ్రామములు వీడి పొరుగూళ్లకు వెడలుటకుగూడ గ్రామస్థులు సాహసింప రయిరి. ఒక వేళఁ బోదమన్నను సరియైన రథ్యలు లేకుండెను. ప్రభుత్వరక్షణ యసలే లేదు. సుస్థిరము, శక్తి వంతము నయిన ప్రభుత్వ మప్పటి దినములలో లేనిదోషమే యీ యప్రశాంతవాతావరణమునకు ముఖ్యహేతువు.

పాండ్యమండలమును చాలకాలముగ పరిపాలించు చుండిన పాండ్యరాజులు బలహీను లయిరి. కఱవులో నధిక మాస మన్నటుల వారిలో వారికి పరస్పరకలహములు కూడ పొడసూపెను. తుద కవి పరిణతస్థితిఁ బొంది పాండ్యవంశస్థులు పంచపాండ్యులను ప్రత్యేక పాండ్య వంశస్థులుగా వ్యవహ రింపఁ దొడఁగిరి. ఇట్టి క్లిష్ట పరిస్థితులందు సింహబలుఁ డగు విశ్వనాథ నాయనయ్య పాండ్యమండలపరిపాలకుఁ డయ్యెను.

నాఁటినుండియు శిథిలములయిన దుర్గములు, గుడిగోపురములు, సత్రములు, మున్నగువానిని పునరుద్ధరించియు, చిట్టడవులు నిర్మూలించి గ్రామములు, వీథులు నేర్పఱచియు, దుష్ట శక్తులను రూపు మాపియు విశ్వనాథ నాయనింవారు పాండ్య మండలమును నివాసయోగ్య మొనరించెను. తదవసరమున పరిపాలనా సౌలభ్యమునకై తన రాజ్యము నంతటిని డెబ్బది రెండు పాళెములుగ విభజించి యా పాళెములకు పూర్వపు పాండ్య వంశస్థులను. తన బంధుజనులను పరిపాలనాధికారులుగ నియమించి కొన్ని షరతు లేర్పఱచి వారికి సంపూర్ణాధికారము నొసఁగియుండెను. వారికి పాళెగారు లని వ్యవహార నామ మేర్పడెను.

దిండుగల్లుకోట చిన్నకట్టీర నాయని కుమారుఁ డగు రంగన్న నాయఁ డను పాళెగారు పరిపాలనాధికారమున నుండెను. ఆ దుర్గమునకు సంబంధించిన సర్వవ్యవహారములందును నతని దే తుదిమాట. అతని యాజ్ఞ నతిక్రమించిన నా దుర్గవాసులకు కఠినశిక్ష విధింపఁబడును. ఒక్కమాటలో రంగన్న నాయఁ డా పాళెమునకు రాజని నుడువఁదగును. అతఁడు కేవలము పరిపాలనాధికారియే కాదు; పేరు గడించిన యుద్ధవీరుఁడును. మధురవారి పక్షముచేరి వైరివీరులతో పలు తడవలు పోరాడి విజయము సాధించెను. అందువలన తిరుమల శౌరి నాయనింవారి యాదరాభిమానములను నతఁడు సంపాదించెను. దళవాయి ప్రధాని రామప్పయ్య యన్నను రంగన్న

నాయనికిఁ గల గౌరవ మపారము. అతనిపై దళవాయికిని నట్టి గౌరవమే యుండెను.

దిండుగల్లు దుర్గమును హస్తగతము చేసికొనఁదలఁచి, మైసూరురాజగు చామరాజ ఉడయరు తన దళవాయి హరసూరు నంజరాజును నా పనికి నియోగించెను. తెనుఁగు వచన భారత కర్తయగు వీరరాజు కుమారుఁడు నంజరాజు. తండ్రి వలె నితఁడును వచనకావ్యములు వ్రాసెను. కన్నడము నందును రచనలు చేసి దళవాయి నంజరాజు సాహిత్యోపాసకుఁ డని చిరయశస్సు గడించెను. అట్టి ప్రతిభాసమన్వితుఁ డతఁడు!

నంజరాజు దిండుగల్లును ముట్టడించి దళవాయి రంగన్ననాయనితో పోరాడసాగెను. ఉభయపక్షముల వారును యావచ్ఛక్తిని వినియోగించి యుద్ధము చేయఁ దొడఁగిరి. నంజరాజునకే విజయము లభ్య మగునట్టి సూచనలు గోచరించుచున్నను రంగన్ననాయఁడు నిరుత్సాహము చెందక యుద్ధము చేయుచుండెను. అంతలో రామప్పయ్య ససైన్యముగ యుద్ధరంగమున ప్రత్యక్ష మయ్యెను. అతనిని చూచిన తడవుగ రంగన్ననాయని చెదరిన హృదయము కుదుటఁబడెను. వారిరువురును పరస్పరాలింగన మొనర్చుకొని యుద్ధవిషయమై ప్రస్తావించిరి. దళవాయి రామప్పయ్యయు, మధుర సైనికులును రంగన్ననాయనికి సాయముగ వచ్చియున్నా రను విషయము నెఱిఁగిన తోడనే నంజరాజును నిరుత్సాహ మావహించెను. నాఁటి యుద్ధము నంతటితో నిలుపుదలచేసి క్రొత్తగ యుద్ధవ్యూహము

పన్నుటకు సైన్యసమేతుఁడై నంజరాజు తన నివాసమునకుఁ జనెను.

ఉభయసైన్యముల కోలాహలముతో దిండుగల్లు మాఱు మ్రోఁగి పోవుచుండెను. వీరవరేణ్యుల వీరావేశపూరిత నినాదములతో పాటు శంఖధ్వనులు, నగారా మ్రోఁతలు, ఢంకా బజాయింపులు మిన్ను ముట్టుచుండెను. రామప్పయ్య రాకతో నంజరాజు భయవిహ్వలుఁ డయినను, యుద్ధమును మాత్రము విరమించుట కతఁడు సమ్మతింపలేదు. జయాపజయములు తేలు నంతవఱకు యుద్ధ మొనర్చుటకే యతఁడు నిశ్చయించెను. తమ బలములను సమకూర్చుకొని మైసూరువారును, మధుర వారును కదనరంగమున ప్రవేశించిరి. యుద్ధము భయంకరముగ జరగ సాగెను. ఉభయపక్షము లందును విపరీతముగ సైనికనష్ట మేర్పడెను. తుదకు మధురవారికే విజయము లభ్య మగునట్టి చిహ్నములు ప్రస్ఫుటము లయ్యెను. ఇఁక లాభము లేదని యెంచి దళవాయి నంజరాజు యుద్ధమును విరమించి స్వదేశాభిముఖుఁడై పలాయనము చిత్తగించెను. అడుగడుగునకు మైసూరి వారివలన నుపద్రవములు సంభవించుచున్నవనియు, మైసూరు వారికి తగిన శాస్తి యొనర్చమి తమకే యెన్నటికైనను వారి వలన ముప్పు వాటిల్లు ననియు దలఁచి దళవాయి రామప్పయ్య నంజరాజును వెంబడించుచుఁ బోయి మైసూరు సమీపమున నతనిని కలిసికొనెను. రంగన్న నాయఁడును రామప్పయ్య ననుసరించెను. పిమ్మట నచటనే మరల యుద్ధ మారంభ మయ్యెను.

ఇటుల దళవాయి రామప్పయ్య పాండ్యమండలము యొక్క శాంతిభద్రతల నుద్దేశించియు, తిరుమలశౌరి నాయనిం వారి ప్రతిష్ఠను సంరక్షించు నుద్దేశముతోను నంజరాజుతో సమరము సాగించు సమయమున పాండ్యమండలాధీశ్వరుని కొలువుకూటమునం దొక విచిత్రము జరగెను. వైద్యనాథయ్య యూనాఁ డూహించినటులనే రామప్పయ్యకు ప్రమాదము సంభవించెను. అతఁడు మధురను వీడి రణరంగమునకుఁ జనిన నాఁటినుండియు నతని విరోధివర్గము తిరుమలశౌరి నాయనిం వారి దరిఁ జేరి దళవాయి కపటి, కలుషిత హృదయుఁడు, స్వామిద్రోహి యని నమ్మకము కలుగునట్లు నుడువసాగెను. వారి మాటలయందలి యాంతర్యమును గ్రహింపక, తిరుమల శౌరి నాయనయ్య తొలుత రామప్పయ్యను నించుక సంశ యించెను. కాని దళవాయి యట్టివాఁడు కాఁడని యతని యంతరాత్మ ప్రబోధించెను.

ఇంతలో నిరువురు వార్తాహరులు యుద్ధభూమినుండి యేతెంచి 'ప్రభువులకు జయము జయ'మనుచు తిరుమలశౌరి నాయనయ్యను సమీపించిరి. వారు యుద్ధవిశేషములను సవి స్తరముగా ప్రభువున కెఱింగించిరి. తిరుమలశౌరి విజయము లభించినందుల కెంతయో సంతసించెను. రామప్పయ్య, రంగన్న నాయకులను పొగడెను. కాని మఱుక్షణమే యతఁడు కోపోద్రిక్తుఁ డగుచు 'మా యాజ్ఞ లేకయే దళవాయి ప్రధాని మైసూరును ముట్టడించెనుగదా !' అనెను.

వార్తాహరులు భయభ్రాంతు లయిరి. ఏదియో నుడువ నభిలషించిరి. కాని ప్రభు వేమనునో యనుభీతిచే వెనుకంజ వేసిరి.

తిరుమలశౌరి నాయనయ్య యా వార్తాహరులను పొమ్మని యాజ్ఞాపించి, రామప్పయ్య విషయమై యితర మంత్రులతో సమాలోచనము జరపసాగెను. దళవాయి ప్రధానిపై పగ సాధించుటకు తగిన తరుణము లభించిన దని సంతసించి, 'రామప్పయ్య గారిపై తీవ్రచర్య తీసికొనుట ప్రకృతము శ్రేయస్కరముగా నుండు'నని సవినయముగ విన్నవించిరి. వారి మాటలను పెడచెవిని బెట్టుచు, 'ప్రధానామాత్యులపై చర్య తీసికొన్నచో లోకము మమ్ము పరిహాసించును. మీఁదు మిక్కిలి మాకు చాలకాలముగ చేదోడు వాదోడుగ సాయ పడుచున్న రామప్పయ్యగారిని శిక్షించిన మాకు శ్రేయస్కర ముగ నుండ దని మా విశ్వాసము' అని తిరుమలశౌరి నాయ నయ్య నుడివెను. మంత్రులు లజ్జాపరవశులై మౌనము వహించిరి.

పిమ్మట నా వార్తాహరులను పిలిపించి తిరుమలశౌరి నాయనయ్య వారి కొక లేఖ నొసఁగుచు, 'రామప్పయ్యగారి ప్రత్యుత్తరమును గొని రం'డని యాజ్ఞాపించెను. ప్రభునాజ్ఞను శిరసావహించి వారు మైసూరునకు ప్రయాణ మయిరి.

ఆ వార్తాహరులు యుద్ధభూమిని జేరునప్పటికే యుద్ధము చాలింపఁబడి యుభయపక్షములవారును తమతమ శిబిరములయందు విడిసియుండిరి. రామప్పయ్య మాత్రము

యుద్ధభూమికి సమీపముగా నున్న యొక కోటలో రంగన్న నాయనితో యుద్ధవిషయమై సమాలోచనము చేయుచుండెను. అప్పటి యతని యాకృతి గోతఁ గొలుపుచుండెను. అతని దుస్తులం దెచ్చట చూచినను నెత్తుటి మరకలు జ్యోతులవలె కనబడుచుండెను. శిరస్త్రాణము సొట్టలు పడియుండెను. రంగన్న నాయఁడును నటులనే యుండెను. అతఁడు మిక్కిలి డస్సినటుల నతని మోము తెలివిడి చేయుచుండెను.

ఇంతలో నావార్తాహరులు రామప్పయ్యను సమీపించి, నమస్కరించి, తిరుమలశౌరి నాయనింవారి ముద్ర గల యీ కమ్మను దళవాయికి సవినయముగ సమర్పించి యాతని ప్రత్యుత్తరమునకు వేచియుండిరి. ఆ లేఖయం దిట్లుండెను.

"దళవాయి ప్రధాని రామప్పయ్యగారికి :—

దిండుగల్లు యుద్ధములో జయము లభించిన దని విని మేము మిక్కిలి సంతసించినాము. అంతటితో యుద్ధమును విరమింపక మైసూరును ముట్టడించి సంజరాజుతో యుద్ధము సాగించుచున్నా రని వార్తాహరుల మూలమున తెలిసి కొన్నాము. మా యాజ్ఞ లేకయే మీరు యుద్ధమునకు దిగి నారు. కాన యీ లేఖను చూచిన తత్ క్షణమే మధురకు వచ్చినను సరే లేక మీ ప్రత్యుత్తరమునైన పంపవలసినది-

తిరుమలశౌరి నాయనయ్య వ్రాలు."

రామప్పయ్య పలుమాఱు లా యుత్తరమును చదివెను. తన విరోధులు పన్నిన కుట్ర కిది ఫలితమై యుండనోపు నని యతఁడు గ్రహించి మందహాస మొనర్చుచు నా లేఖను

రంగన్న నాయని జూడుమని కోరెను. అతఁడట్లే యొనర్చి, 'ప్రభుసేవాపరాయణునికి లభించునట్టి స్వాతంత్ర్య మీరీతిగ నుండు' ననుచు రంగన్న నాయఁడు పరిహాసోక్తులాడఁదొడఁగెను. దళవాయి యతనిని వారించుచు, 'నాయఁడు! తిరుమల శౌరి నాయనింవారు సహృదయులని నీకు నేను ప్రత్యేకముగ నుడువ నవసరము లేదుగదా! ఇతరమంత్రుల ప్రోద్బలముతో నీవిధముగ వ్రాసియుందు రని నా నమ్మకము. ప్రస్తుతము కొన్ని దుష్టశక్తులు నన్నావరించి యున్నవి. ఆ విషయమును సవిస్తరముగ తరువాత నుడివెదను గాని యిప్పు డేమి చేయుదము? ప్రభునాజ్ఞను తిరస్కరించుట మనకు శ్రేయస్కరముగ నుండదు. పోనీ శిరసావహించినచో పడిన శ్రమ యంతయు వ్యర్థ మగునుగదా! మైసూరి వారివలన నడుగడుగునకు యుద్ధములు సంభవించుచున్నవి' అని నుడివెను.

దళవాయి యిట్లు మథనపడుచుండఁగా నా వార్తాహారులు ప్రత్యుత్తర మిమ్మనుచు నతనిని తొందరించిరి. వారి యసభ్యప్రవర్తనమునకుఁ గినిసి, 'వీరికి శృంగభంగ మొనర్పుఁ' డని యతఁడు తన సేవకుల కాజ్ఞ యిడెను. స్వామిభక్తులగు నా సేవకులు దళవాయి యాజ్ఞను సక్రమముగ నిర్వర్తించిరి. ఈ దృశ్యమును తిలకించుచున్న రంగన్న నాయఁడు 'వార్తాహారులకు తగిన శాస్తి జరిగినది. కాని యిట్లొనర్చుట వలన మనకు ముప్పు వాటిల్లునేమో! రాజదూతల నవమానించుట మహాపరాధమేగదా!' అనెను. రామప్పయ్య పశ్చాత్తప్తహృదయుఁ డయ్యెను. 'ప్రభునాజ్ఞ లేకయే మైసూ

రుని ముట్టడించి స్వామిద్రోహ మొనర్చితిని. ఇపుడు రాజ దూతల నవమానించితిని. ఇట్టి స్వామిద్రోహ చర్యలవలన నాకు పాపము తప్ప మఱేమియు లభింపదుగదా-' అని నుడివి కొంతవడి మిన్నకుండి, 'నాయఁడు! ఇఁక నింతటితో యుద్ధమును విరమింతము. నీవు సమ్మతింతువా?' అని రంగన్ననాయని ప్రశ్నించెను.

"పాండ్య మండలమున శాంతిభద్రతలు సుస్థాపితము లగుటకే గదా మీరు యుద్ధము చేయుచున్నారు. ఇందులో స్వామిద్రోహ మేమి కలదు? పాండ్యమండలాధీశ్వరుని కొఱకై మనము యుద్ధము చేయుచున్నాము గాని స్వార్థచింతనతోఁ గాదుగదా! అదియునుగాక యీ యుద్ధమునందును మనకు జయము లభింప నున్నది. ఇట్టి యెడ యుద్ధవిరమణ మెంతమాత్రము సమంజసము గాదని నా యభిమతము."

రంగన్ననాయని గంభీరోక్తులు కొంతవఱకు దళవాయికి మనశ్శాంతిఁ గలిగించెను. మరల రంగన్ననాయఁ డిట్లనెను. "ఈ వార్తాహరులు కొలువుకూటమునకుఁ జని యట మీపై లేనిపోని మాటలు నుడువుదు రను సంశయము మీ కున్నచో నేనే స్వయముగఁ జని తిరుమలశౌరి నాయనిం వారిని సందర్శించి యుద్ధవిషయములను వివరించెదను. మీరు మాత్రము నంజరాజుతో యుద్ధము సలుపవలయు ననియే నా వేఁడికోలు."

తోడనే రంగన్న నాయనిం కౌగిలించుకొని, 'నీ యభిమతమే నా యభిమతము. తప్పక విజయము సాధించె దను. రాజదూతల నవమానించినందులకు పశ్చాత్తప్తుఁడ నయితి నని తిరుమలశౌరినాయనయ్యతో నుడువుము'' అని రామప్పయ్య పలికెను. పిమ్మట నతని యొద్ద సెలవు దీసికొని రంగన్ననాయఁడు మధురకు ప్రయాణ మయ్యెను.

దళవాయి రామప్పయ్య నంజరాజుతో యుద్ధము సాగించెను. మైసూరు దళవాయి తన యావచ్ఛక్తిని విని యోగించి పోరాడెను. అతని సైన్యమున చాలమంది వీర స్వర్గము నలంకరించిరి. పలువురు గాయపడిరి. తుదకు విజయ లక్ష్మి రామప్పయ్యను వరించెను. అంతటితో యుద్ధము సమాప్త మయ్యెను. మైసూరువారి గర్వము నడంచిన దర్పముతో రామప్పయ్య ససైన్యముగ తన నివాసమునకు విచ్చేసి తిరుమలశౌరినాయనిం వారికి విజయ వృత్తాంత మును తెలుపుచు నొక లేఖ వ్రాసెను.

''శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ శ్రీ తిరుమల శౌరి నాయనయ్య మహారాజులుంగారి సన్నిధికి తమ ఆశ్రి తుఁడు దళవాయి ప్రధాని రామప్పయ్య అనేక నమస్కార ములు పెట్టి మనవి చేసికొను విన్నపము.

తమ యాజ్ఞను శిరసావహించి రంగన్ననాయనికి సహాయముగ నేను దిండుగల్లు యుద్ధములో పాల్గొంటిని. శ్రీ మీనాక్షీసుందరేశ్వరుల స్థిరతర కరుణాకటాక్షములవలన మనకు విజయము లభించినది. మన వార్తాహరుల మూల

ముగా ఈ విజయ వృత్తాంతమును తమకు తెలిపియున్నాను. అంతటితో యుద్ధమును విరమింప యత్నించితిని. కాని మైసూరువారి దర్పమును పూర్తిగ నడంచిననే గాని మన పాండ్యమండలమున శాంతిభద్రతలు సుస్థిరములుగ నుండ వని భావించి నంజరాజుతో యుద్ధము చేయుటకే నిశ్చయించితిని. అంతేగాని తమ యాజ్ఞ నతిక్రమింప వలయు నను మలినభావము న భూతో న భవిష్యతి. మఱొక ముఖ్య విషయమును తమకు మనవి చేయుచున్నాను. మైసూరు యుద్ధములోఁ గూడ మనకే యంతిమ విజయము కలిగినది. కనుక ససైన్యముగ నేను మధురకు ప్రయాణ మగుచున్నాను. సమక్షమున తమకు సర్వవిషయములు మనవిచేసికొందును.

ఇట్లు,

తమ ఆశ్రితుఁడు,

దళవాయి ప్రధాని రామప్పయ్యవారలు.

లేఖపై తనముద్ర వైచి దళవాయి దానిని తన సేవకుల మూలముగ తిరుమలశౌరినాయనింవారికి పంపించెను.

మధురకు ప్రయాణమై వెడలిన రంగన్ననాయఁడు తిరుమలశౌరినాయనిం వారిని సందర్శించి యుద్ధ విషయములను ప్రస్తావించు నవసరమున దళవాయి ప్రధాని నిష్కల్మష హృదయుఁడు, స్వామి భక్తుఁడనియు, పాండ్యమండల శ్రేయస్సును కాంక్షించియే యతఁడు పోరాడుచున్నాఁ డనియు రంగన్ననాయఁడు నుడివెను. అతని మాటల యందలి భావమును గ్రహించి 'తొందరపడి ప్రధానామాత్యులను సంశయించి

తిమి. వారి గుణగణములు సౌశీల్యము మాకు తెలయనివి కావు. నిజము నుడువవలసి వచ్చినచో రామప్పయ్యగారు రెండవ అరియనాథ మొదలి యని పేర్కొన వలయును.' అని తిరుమలశౌరినాయకుఁడు పలికెను. పిమ్మట దిండుగల్లు పాళెమునకు సంబంధించిన విషయముల నన్నిటిని తెలిసి కొని రంగన్ననాయని దళవాయి వచ్చు నందాక తమ కొలువుకూటములో నుండు మని యతఁడు కోరెను.

ఒకనాడు రంగన్ననాయఁడు కొలువుకూటమున కేగు చుండగా నొక యాశ్విక శకటము శరవేగమున నంతః పురాభి ముఖమై వచ్చుచుండుటను గాంచెను. విజయలక్ష్మి వరించిన దళవాయి ప్రధాని రామప్పయ్య వచ్చుచున్నాఁడని యతఁడు గ్రహించి తద్విశేషమును తిరుమలశౌరి నాయనిం వారికిఁ దెలియఁజేయ నొక దౌవారికుని రాచనగరునకు పంపెను. అంతలో నా శకటము రంగన్ననాయని సమీపించెను. దళవాయి యాజ్ఞానుసార మా శకట మచటనే నిలుపఁబడెను. రామప్పయ్యకు నమస్కరించుచు 'మిమ్ము వరించి విజయలక్ష్మి ధన్య మైన'దనుచు నతనిని రంగన్న నాయఁడు ప్రశంసించెను. అందులకు సంతసించుచు మంద హాస మొనర్చి ప్రభువుల యాగ్రహ మెట్లున్న దని దళవాయి ప్రశ్నించెను. తమ రాకకై ప్రభువులు నిరీక్షించుచున్నా రని యతఁడు నుడివినంతనే పట్టపగ్గాలు లేని సంతోషముతో, "నాయఁడు! నా గౌరవమును నిలిపితివి. ఆజన్మాంతము నీ

మేలును మఱచిపోను. మన స్నేహలత వర్ధిల్లునుగాక' యనుచు రామప్పయ్య యతనిని కౌఁగిలించుకొనెను.

దళవాయి ప్రధాని వచ్చియున్నాఁడని తెలిసినవెంటనే యతనిని స్వయముగ నాహ్వానింప నభిలషించి తిరుమలశౌరి నాయనయ్య కొలువుకూటమునకు విచ్చేసెను. పరస్పరాలింగనములో నున్న దళవాయిద్వయమును గాంచినంతనే తిరుమలశౌరి నాయనయ్య మిక్కిలి సంతసించి యిట్టి సౌభ్రాతృత్వము మా నాయకరాజులం దున్నచో మమ్ముఁ బ్రతిఘటింప ఫాలాక్షునకుఁగూడ గాదని యనుకొనెను.

తరువాత రామప్పయ్యతో కరచాలన మొనర్చి 'మా గౌరవమును నిలిపి మా కెంతయో మేలు చేసినా' రనుచు నతఁడు కృతజ్ఞతఁ దెలిపెను. ఈ విధముగ తన్ను సగౌరవముగ తిరుమలశౌరి నాయకేంద్రుఁ డాహ్వానించు నని దళవాయి కలనైన ననుకొని యుండలేదు. రంగన్ననాయని చూపుచు, 'ఇతఁడు ప్రదర్శించిన ధైర్యోత్సాహములే నా విజయమునకుఁ గారణములు. మిక్కిలి స్నేహపాత్రుఁడు' అనుచు దళవాయి యతనిని పొగడెను. తిరుమలేంద్రుఁ డందులకుఁ జిఱునవ్వు నవ్వి యూరకుండెను.

రామప్పయ్య కింకను మనశ్శాంతి లభింపలేదు. వార్తాహరులకు తా నొనర్చిన శృంగభంగ మింకను నతని మనస్సును చీకాకు పఱచుచుండెను. 'ఏలినవారు సహృదయులు కాఁబట్టి సరిపోయినది. లేకున్న నే నొనర్చిన యపరాధమునకు తగిన ప్రతిఫలము నాకు ముట్టి యుండెడిది.

తాము పంపిన వార్తాహరులను నవమానించి నందులకు క్షమింపుఁడు' అని దళవాయి సవినయముగ నర్థించెను. అతని గుండెబరువు చాలవఱకు తగ్గెను. తిరుమలశౌరి నాయనింవారు మందహాస మొనర్చుచు మంత్రులవైపు సాభిప్రాయముగఁ జూచిరి. తలలు వంచియున్న మంత్రి శేఖరులను జూచి వీరు దళవాయి విరోధులై యుండ నోపుదు రని రంగన్న నాయఁడు గ్రహించెను.

తిరుమలశౌరి నాయనింవారి చూపులను గుర్తించిన రామప్పయ్య పెదవులపై హాసము లాస్య మాడెను.

# ౪

నడివేసవికాల మది. వైఘునది యందు నీ రెండి పోయెను. మధురానగరములోని పూలతోటలకు నీరు సమృద్ధిగ లభించుట దుర్లభముగ నుండెను. అయినను నిరుత్సాహము చెందక తోటమాలులు వేయికండ్లతో వానిని జూచుచుండిరి. ప్రతి వేసవియందు మల్లెలు కొల్లలు కొల్లలుగ లభించుచుండును. ఆకాలమున జరగు దేవోత్సవములందు దేవతా విగ్రహములను కేవలము మల్లెపూవులతో మనోజ్ఞముగ నలంకరింతురు. ఆ యలంకరణము కన్నులపండువు గొలుపుచుండును. త్రికాలములందును దేవపూజ సక్రమముగ జరగుచుండును. పూజానంతరము విగ్రహములనుండి తీసివైచిన సుమహారములను నాలయపరిచారకవర్గము తలఁదాల్చును. నివేదనార్థమై వినియోగింపఁబడిన పదార్థములు ముముక్షువుల కొసఁగుచుందురు.

ఆనాఁటి యెండకు మధురానగరవాసులు తహతహలాడిపోయిరి. ఎండవేడిమికి తట్టుకోఁజాలక తన్నగరవాసులు గృహములందే యుండుటచే నగరవీథులు జనశూన్యములయి యుండెను. అంగడి వీథులందును జన సమ్మర్దము లేకుండెను. అంగడివీథుల చూడ ముచ్చట గొలుపుచుండును. ఒకవైపు రత్నములు, వెండి బంగారములు-విక్రయింపఁబడు చుండును. మఱొకవైపు పాశ్చాత్యదేశములనుండి యేతెంచు సరకు లమ్మఁబడు చుండును. పాశ్చా

త్యాలే యీ వర్తకము చేయుచుందురు. వారికి దేశభాషలు తెలియకపోయినను బేరములు మాత్రము సరసముగా జరగుచుండును. ఇంకొక మూల సుమవిక్రయశాల యుండును. అయ్యది విపణివీథులకే కాక నగరమున కంతటికిని శోభను గూర్చుచుండును. రకరకాల పుష్పాలు, రంగు రంగుల పూవులును తెల్లగ తెల్లవారు సరికే లెక్కకు మిక్కుటముగ వచ్చి పడును. సుమవిక్రయము సాధారణముగ స్త్రీల హస్తగతమై యుండును. ఆ విక్రయశాలకే తెంచువారిలో చాల మంది మహిళలే.

సాయంసమయ మయ్యెను. ఎండవేడిమి కొంత తగ్గెను. కాని వెచ్చనిగాలి వీచుచునే యుండెను. ఇంకను గృహములందే క్రుమ్మటకు మనస్కరింపక పురుషులు కొందఱు తెల్లని పలుచని వలువలు దాల్చి వైఘనదీతీరమునకుఁ జని యటఁ గొంత తడవు విశ్రాంతి దీసికొన నభిలషించి వైఘకు బయల్వెడలిరి. వైఘ యంత పెద్దనది కాదు. వేసవియందు తప్ప మిగిలిన కాలములం దా నదియందు జలము సమృద్ధిగ నుండును. ఆ నదినుండి పిల్లకాలువ లనేకములు పాండ్యమండలమంతట నాగుఁబాములవలె ప్రాకుచున్నట్లు కన్పించుచుండును. వేసవినాఁటికి నదిలో నిసుకతిన్నె లేర్పడియుండును.

అంతఃపురమునందలి సుందరోద్యానమున నిర్మితమయిన చలువ చప్పరమున నున్నను, నాఁటి యెండవేడిమికి తహతహ లాడిపోయిన తిరుమలశౌరి నాయనయ్య వైఘనదీతీరమునకుఁ జన నభిలషించెను. వాహ్యాళికి వెడలు

నపుడు పరివారముతోఁ గూడి చనుట యతని కలవాటు. అప్పు డతని వేషధారణము నిరాడంబరముగ నుండును. పండుగు వేళలందును, విశేషసమయములందును తప్ప తక్కిన సందర్భములందు తిరుమలశౌరి నాయనయ్య తెల్లని పట్టు పుట్టములు మాత్రము ధరించును. అతఁడు చెప్పుకొనఁదగినంత రూపరి కాఁడు. కొంచెము నల్లగ, లావుగ నుండును. అప్పటి కతనికి పిల్లి బొజ్జకూడ వచ్చియుండెను. అతని విశాలవదన మండలము కొట్టవచ్చిన ట్లుండును. ఆ నల్లని కన్నులలో సిరి నివాసము చేయుచుండును. ఎల్ల వేళలందును నతని మోము కస్తూరీతిలకముతో ప్రకాశితము. ప్రాతస్సాయంసమయములందు నుదుటిపై విభూతి వైచి దానిపై కుంకుమబొట్టు పెట్టి యంతఃపుర ప్రాంగణమున నిర్మితమై యున్న సుందరేశ్వర మందిరమునకుఁ జని యీశ్వరధ్యానము సలుపుచుండును.

అతఁడు మహారసికుఁడు. దక్షిణనాయకుఁడును. అయినను పట్టమహిషి యగు అచ్యుతరఘునాథమ్మపై నాతనికమిత మగు ప్రేమ. ఆమె తంజావూరు రఘునాథరాయ మహారాజులుంగారి ముద్దుల కొమరిత. పండిత పోషకుఁడును, స్వయముగ పండితకవియు నైన తండ్రియొద్ద అచ్యుత రఘునాథమ్మ సంస్కృతాంధ్రములు నేర్చెను. సంగీత సాహిత్యములందామె కెంత యభిరుచియో శిల్పచిత్రకళలయందును నామెకుఁ జెప్ప నలవి కాని యభిరుచి.

పరివారము సిద్ధముగ నుండెను. కాని దళవాయి ప్రధాని రామప్పయ్య రాకకై యెల్లరు నిరీక్షించుచుండిరి.

అంతలో దళవాయి కూడ నేతెంచెను. ముందు పరివారము నడచుచుండ, తిరుమలశౌరి నాయనయ్య, పట్టమహిషి, రామప్పయ్య మున్నగువారు వెనుక నడచుచుండిరి. అంతః పుర ప్రాంగణమున నొక సుందరమందిరము నిర్మిత మగు చుండెను. దానిని పరీక్షింపఁగోరి రాజదంపతులును, రామ ప్పయ్యయు తన్మందిరాభిముఖులై చనిరి. పరివారము అంతః పురబహిర్ద్వారము నొద్ద వేచియుండెను. తిరుమలశౌరినాయనిం వారి రాకను మున్ముందుగ గ్రహించిన యా సుందరమందిర నిర్మాత లగుశిల్పాచార్యులు, పనివాండ్రును నచటనేయుండిరి. తిరుమలేంద్రుని గాంచినంతనే వారెల్లరు వినయాంజలి ఘటించి మిన్నకుండిరి. అంత నొక శిల్పాచార్యుఁడా నిర్మా ణమునందలి ప్రత్యేకతను వివరించుచు తన పనితనమును చూపించుచుండెను. తిరుమలశౌరి నాయనయ్య సంతసించి నవ్వు మొగముతో రామప్పయ్యవైపు చూచెను. పనితనము ప్రశంసింపఁ దగియున్న దని యతఁ డనుచుండఁగ అచ్యుత రఘునాథమ్మ కలకల నవ్వెను.

తిరుమలశౌరి నాయనిం వారి కేమియు తెలియక 'ఎందులకు నవ్వితి' వని యామెను ప్రశ్నించెను.

ఆమె మిన్నకుండెను. తిరుమలేంద్రునికి కోపము వచ్చెను. సాధారణముగ నతఁడు స్మితవదనుఁడై సరసోక్తు లాడుచుండును. కోపము వచ్చెనా యతనిని శాంతింపఁ జేయుట మిక్కిలి కష్టము. అతని కోపకారణమును రామప్పయ్య

గు ర్తించెను. కాని పట్టమహిషి యెందులకు నవ్వెనో యతఁడు గ్రహింపలేకపోయెను.

మరల నవ్వుచు, 'ఈ నిర్మాణమును చూచియే యిట్లు పొంగిపోవుచున్నారు. మా తంజావూరి యంతఃపుర మందిరములను చూచిన నిం కెట్లు ప్రశంసింతురో!' అని యామె సహజముగ పలికెను.

తిరుమలశౌరి నాయనయ్య రుద్రుఁ డయ్యెను. కాని తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో, 'ఈ మందిరము బాగుగ లేదు కాఁబోలు-' అనెను. 'బాగుగ లేదని కాదు నా యభిప్రాయము. తంజావూరు రాజమందిరములతో నిది సరివచ్చుట లేదని నా భావము' అనెను.

'చింత చచ్చినను చేవ చావ లే దన్నట్లు మీ తంజావూరివారి కింకను గర్వము తగ్గలేదు. దేనిని చూచుకొని ఇంత గర్వమో! అచ్యుత దేవ మహారాయరాజులుంగారు కనికరించి స్త్రీ ధనముగ మీ వారికి రాజ్య మిచ్చెను; లేకున్న తంజావూరి వారికి రాజ్య మెక్కడనుండి వచ్చెడిదో? రాజ్య మేలుకొను మని నుడివిన గ్రుడ్డివాడు మాత్రము రాజ్యము నిరాకరించునా?'

తిరుమలేంద్రుని యీ మాటలు అచ్యుత రఘునాథమ్మకు విన నశక్యములుగ నుండెను. 'శ్రీ కృష్ణదేవరాయలవారు కనికరించనిచో మీ పూర్వులకు మాత్రము రాజ్య మెక్కడిది?' అని యామె కోపోద్రిక్తయై ప్రశ్నించెను. 'మాపూర్వులు చోళ, పాండ్యమండలములను స్వశక్తిచే సంపాదించిరి.

యుద్ధము చేసి జయించి యీ మండలములను హస్తగతము చేసికొనిరి. మామూలపురుషుఁ డగు నాగమ నాయనయ్య సముపార్జించిన ధనరాసులను గూడ విశ్వనాథ నాయనయ్య పాండ్యమండలమును పునరుద్ధరించుటకై వ్యయము చేసె నని లోకమునకుఁ గూడ తెలియును. కనుక స్వశక్తిచే చోళ పాండ్యమండలములను సంపాదించితిమి. అంతే గాని తంజా వూరి రాజులవలె మే మీ మండలమును స్త్రీధనముగ పొంది యుండలే దని యిప్పటికైనను తెలిసికొనుము. స్త్రీ ధనముగ పొందిన మండలమును పరిపాలించుచున్నను మీ వారి కింత మిడిసిపా టెందులకో! చూచెదను గాక.'

తిరుమలశౌరి నాయని క్రోధోద్ధతిని గ్రహించిన అచ్యుత రఘునాథమ్మ మిన్నకుండెను. కాని యతని పలుకు లామె హృదయమును అంపపుపోత పెట్టుచుండెను. శోక భారము నడంచుకొనఁజాలక 'స్త్రీ ధనముగ మాకు తంజా పురము లభించినను, మీ పూర్వులవలె మేము తాంబూల కరండవాహక (అడపం) వృత్తిలో నియోగింపఁబడి యుండ లేదు' అనెను.

అప్పటి కామెకు మనశ్శాంతి లభించెను. కాని య ట్లనుటచే తనకు ముప్పు కలుగు నేమో యని మిక్కిలి విచారింపసాగెను. కోపోద్రిక్తుఁడై పరధ్యానమున నున్న తిరుమలశౌరి నాయనయ్య కామె మాటలు స్ఫుటముగ వినఁ బడలేదు. ఏదియో లోలోన గొణుగు కొనుచున్న దని తలఁచి యతఁడు తిరిగి ప్రశ్నింపలేదు. రామప్పయ్య విన్నను

విననట్లు నటించి సవినయముగ నిట్లనెను. 'ప్రభూ! పుట్టింటిపై నున్న మమకారముచే దేవిగారు నవ్వులాటకై యట్లనిరి కాని మరేమియు లేదు. మీనాక్షీసుందరేశ్వరాలయమున ప్రస్తుతము నిర్మిత మగుచున్న మహాలును చూచినంతనే రాణిగారు తంజావూరు రాజమందిరములను విస్మరింతు రని నా విశ్వాసము.'

కొంతవడి మిన్నకుండి 'మీకు తెలియని విషయ మేమియు లేదుగదా! మా అన్నగారి కుమార్తైను రఘునాథ రాయల వారి కిచ్చి వివాహము చేసినను, మాకును వారికిని గల వైషమ్యము లంతము గాలేదు. రాజకుటుంబమునకు చెందినవార మని తంజావూరి పరిపాలకులు విఱ్ఱవీగుచున్నారు. అట్టివారితోఁ సంబంధము చేయుట కాని, చేసికొనుట గాని శ్రేయస్కరము గాదేమో!' అని తిరుమలశౌరి నాయనయ్య పలికెను.

'అట్లనవలదు ప్రభూ–మీ రెల్లరు విజయనగర సమ్రాట్టులకు సామంత నృపాలు రని లోకవిదితముగదా! ఒక్క త్రాటిపై మీరు నిలిచి యున్నచో మిమ్ము ప్రతిఘటించు వీరుఁడు లేఁడని నా ప్రగాఢవిశ్వాసము...' అని రామప్పయ్య యనుచుండగా నతనిమాటల కడ్డు వచ్చి, 'అంతటి అదృష్టము మా నాయక రాజులకుఁ గలుగదు. ఎవరికి వారే ప్రముఖుల మనెడి యభిప్రాయము నానాఁటికి బలిసిపోవుచున్నది. ఇట్టియెడ సమష్టికృషికి తావు లేదుగదా' అని తిరుమలేంద్రుఁడు నిరుత్సాహముగ పలికెను.

అగు నన్నట్లుగ అచ్యుత రఘునాథమ్మ రామప్పయ్య వైపు చూచెను. ఆమె యభిప్రాయమును గ్రహించి తిరుమల శౌరి నాయనయ్య మిన్నకుండెను. ఇంతలో హజారమున నాలుగంటలు కొట్టిరి. వెలుఁగు తగ్గి చీకటి పడుచుండెను. వేవెలుఁగు వచ్చినప్పటినుండియు శ్రమించుచున్న హాలికులు, శ్రమజీవులు గృహోన్ముఖు లయిరి. బిలబిల మనుచు విహంగ ములు వ్యోమవీథిని తమతమ నెలవులకుఁ జనుచుండెను. నగ రములోని యాలయములందలి ఘంటానాదములు మిన్నుముట్టు చుండెను. అంతఃపుర ప్రాంగణమున రాచకొలమువారికి ప్రత్యేకముగ నిర్మితమై యున్న యాలయమునుండి విప్రవరే ణ్యుల వేదపఠనము వినఁబడుచుండెను. వేదఘోషతో పాటు శ్రావ్య మగు నాగస్వరముగూడ శ్రవణగోచర మగుచుండెను.

తిరుమల నాయనయ్య అచ్యుత రఘునాథమ్మను సమీ పించి 'దేవీ-యిక్కడనే ప్రొద్దు పోయినది. రేపు తప్పక పోవుదము' అనెను. ఆమె కోప మేదారిఁ బోయెనో గాని సుప్రసన్నయై 'రేపా! రేపటి కార్యక్రమమును మఱచితిరి కాఁబోలు' అని నవ్వుచు నుడివెను.

రాజదంపతుల ప్రేమాతిశయమునకు లోలోన సంత సించుచు రామప్పయ్య యిట్లనెను. 'రేపు మన కొలువుకూట ములో కవిసమ్మేళనము జరగ నున్నది. అదియునుగాక పరమభక్తుఁడు, సంగీత సాహిత్య విశారదుఁడు నగు క్షేత్రయ్య గారు విచ్చేయుదు రని తెలియవచ్చినది. ఈ విషయమును తమతో నుడువుట మఱచితిని.'

పట్టమహిషిని సాదరముగ జూచి నవ్వి తిరుమలశౌరి నాయనయ్య రామప్పయ్య నుద్దేశించి, 'విద్యాగోష్ఠు లనిన మీ రాణిగారికి చెప్ప నలవి కాని యభిమానము. సంగీత సాహిత్యము లన్న మాకును విశేషాభిమాననే గాని యీ విషయములో నామెదే పై చేయి యని మా విశ్వాసము. మీ రేమందురు ?' అని ప్రశ్నించెను.

'అవును ప్రభూ-తంజాపుర వాసులు సంగీత సాహిత్యము లందు సిద్ధహస్తులని ప్రతీతి. ఇది అత్యుక్తి కాదని నా నమ్మకము. అంతియ కాక స్వయముగ రఘునాథరాయ మహారాజులుంగారు పండితుఁడు, కవి, భాషాపోషకుఁడు. ఈ హేతువుచేఁ గూడ తంజాపురమున సంగీతసాహిత్యములు బహుళ ప్రచారము నందిన వని తలఁచుచున్నాను.'

'మీరు నుడివినది యథార్థము. మా పూర్వులు చిత్రకళ, శిల్పములతోఁబాటు సంగీతసాహిత్యములుగూడ పోషించిరి. మన కొలువుకూటములో లింగనమఖి కామేశ్వర కవి మున్నగు కవిదిగ్గజము లున్నారు. అయినను మనము తంజావూరి వారికి వెనుకఁబడియున్నాము-' అచ్యుత రఘునాథమ్మ కెక్కడ లేని సంతోషము కలిగినను మౌనము వహించెను.

పిమ్మట గొంతతడవు రాజ్యవ్యవహారములు చర్చించి తిరుమలశౌరి నాయనయ్య తన దేవేరితోఁ గూడి యంతఃపురమునకుఁ జనెను. రామప్పయ్యకూడ నిజగృహాభిముఖుఁడై వెడలెను.

తిరుమలశౌరి నాయనయ్యవారి కొలువుకూటమది. కలకల లాడుచుండెను. ముద్దులు మూటగట్టు ముగ్ధమోహన మూర్తులు కుడ్యములపై చిత్రితములయి యుండెను. ఆ చిత్ర రాజములలో చాలవఱకు శృంగారసమ్మిశ్రితములు. రాధాకృష్ణుల పవిత్రప్రేమను వెలిబుచ్చు చిత్రము లెన్నియో యుండెను. పురాణపురుషు లగు పార్వతీ పరమేశ్వరుల లీలారికము నభివర్ణించు చిత్రములు కూడ లెక్కకు మిక్కిలిగ నుండెను.

రాజవంశస్థులు, మంత్రులు, ప్రభుత్వోద్యోగులు, పండితులు, కవులు, కళారాధకులు, ప్రముఖులు-మున్నగు వారితో సభాభవనము కిటకిటలాడుచుండెను. ఎల్లరును భక్త శ్రేష్ఠుఁడగు క్షేత్రయ్యగారి రాకకై నిరీక్షించుచుండిరి. క్షేత్రజ్ఞుని పేరు పెంపులను, అతని మధురమంజుల మనోహర పదములను వినియుండిరే కాని యతఁడు స్వయముగ నర్తించుచు గానము చేయుటను జూచి యుండని హేతువుచే నతనిని దర్శించు భాగ్య మెపుడు కలుగునా యని వారు తత్తర పడుచుండిరి. మువ్వగోపాల స్వామివారి భక్తుఁడగు నమ్మహనీయుని దర్శించినఁ జాలు, తమకు తరణోపాయము కలుగునని వారి విశ్వాసము. అతని మధురపద జాలములు విన్నఁ జాలు తమకు స్వర్గసౌఖ్యము గలుగు నని వారి దృఢాభిప్రాయము.

ఇంతలో ఫిరంగులమ్రోఁత వినవచ్చెను. మంగళవాద్యముల ఘోష చెలరేగెను. పిమ్మట వందిమాగధుల ప్రశంసా

వాక్యములు, రాజభటుల పరాకులు ప్రస్ఫుటముగ విన నయ్యెను.

'అరుహన్నిబ్బరగండ బిరుదవిరాజిత శ్రీ విశ్వనాథాన్వయాంభోధి చంద్ర, కాశ్యపాభిఖ్య గోత్ర, ముద్దుకృష్ణ భూపాలనందన, త్రిశిరఃపుర జీర్ణదుర్గాది పునఃప్రతిష్ఠాపిత శ్రీ ముద్దువీరావనీపాలసహోదర, సకల సామ్రాజ్య ధౌరేయ, సరససంగీత సాహిత్య కళాపోషక, మేరుసమాన ధైర్యయశస్తిలక, శ్రీ మీనాక్షీసుందరేశ్వర స్థిరతర కరుణా కటాక్ష సంపాదిత సాహిత్య విశేష, విద్వన్మండల వాంఛితార్థ, దక్షిణ మహాసముద్రాధీశ్వర, చేరచోళాది భూభృత, సమయ ద్రోహరగండ, కవిపండిత కల్పద్రుమ, పరదుర్వార భుజావిక్రమశాలి, జయంత చంద్రకందర్ప జయసౌందర్యశాలి, మీనాక్షీ సుందరేశ్వరాలయాంతర్గత సుందరమందిర (తిరుమల నాయకుని మహలు) నిర్మాత, నవ్యమంటప ప్రతిష్ఠాపక, అనేక జీర్ణాలయోద్ధారక, అచ్యుత రఘునాథ దేవీ హృదయవిహార, శ్రీమత్పాండ్య మండలాధీశ్వర ముద్దు తిరుమలశౌరి నాయకేంద్ర, భూలోక దేవేంద్ర, కీర్తిసాంద్ర, రాజాధిరాజ మహారాజ, జయ విజయీభవ దిగ్విజయీభవ.'

తిరుమలశౌరి నాయనింవారు సభాభవనమునకు వేంచేసిరి. అతని కిరుప్రక్కల లావణ్యలతికలగు నిరువురు జవ్వనులు వింజామరములు వీచుచుండిరి. దళవాయి ప్రధాని రామప్పయ్య, క్షేత్రయ్య మున్నగు ప్రముఖులుకూడ నతనితో నుండిరి. తిరుమలేంద్రుడు సభాస్థలిలో నడుగిడిన తోడనే

సభాసదు లెల్లరు లేచి నిలిచిరి. అతఁడును రామప్పయ్యయు తమతమ యాసనములం దాసీను లయిన పిమ్మట సభాసదులు నాసీను లయిరి.

కొలువుకూటమున కలంకార ప్రాయము, రత్నఖచితము నైన సింహాపీఠమున తిరుమలేంద్రుఁ డాసీనుఁ డయ్యెను. అతనికి కుడివైపున దళవాయి రామప్పయ్య యొక యున్నతాసనము నలంకరించెను. వామభాగమున క్షేత్రయ్య, లింగనమఖి కామేశ్వరకవి, మఱికొందఱు కవిపుంగవులు, గాయనీ గాయకులు కూర్చుండియుండిరి. నట్టువ కత్తెలు, విలాస విలాసినీ జనము సింహాసనమునకు వెనుక భాగమున నాసీను లయి యుండిరి.

తిరుమలశౌరి నాయనింవారి యభిమతానుసారము గాయని యొకర్తె మధురమీనాక్షీ దేవిని స్తుతించెను.

రాగము : నిత్యకళ్యాణి

దేవీ మీనాక్షీ ముదం దేహీ మే సతతం అంబ
పావని మధురానిలయే పాండ్యరాజతనయే ॥దే॥
భావరాగ తాళాదిక పరితోషిత హృదయే
భావుకఫలప్రదాయిని భక్తమోదసంధాయిని
సేవకపాపవిమోచని శ్రీకదంబవనవాసిని ॥దే॥

హిమకరనిభవదనే విమలకుందరదనే
మహనీయమణిసదనే రక్షితమదనే
సుమశరజనకసహోదరీ సుందరేశహృదయేశ్వరి

సమరనిహతనిఖిలాసురి సాధువశంకరి శాంకరి
కమలజాదిసురపాలిని ఘనతరశుభగుణశాలిని
సమదానేకపగామిని సంగీతరసహ్లాదిని ॥దే॥

పిమ్మట సభ ప్రారంభ మయ్యెను. కవిశేఖరులు కొందఱు పాండ్యమండలాధీశ్వరుని ప్రశంసించుచు పద్యరత్నములు సమర్పించిరి.

అనంతరము క్షేత్రయ్య మధురాపురీశునిపై తాను రచించిన పదము పాడుచు నభినయ మొనరించెను.

మోహన—ఆది

పరదేశమునఁ జేసిన పను లిందుఁ జెప్పరాకురే!
తరుణులార! యిదెక్కడిజోలి
తాళఁగదరె! మీపుణ్య మయ్యాని! ॥పర॥
దానియింటికి పోయి వలచి ధనము లిచ్చి వేడుకొన్నాడా?
వాని చక్కదనమె చూచి వలచి పైకొని బతిమాలి
గానవిద్యాప్రౌఢిమచే కరగించినట్లు గాబోలు
మానిని మగవాడు గనుక మనసు నిలుప లేడాయె ॥పర॥
పూచిన తంగేడువలెనె భూషణభూషితురాలై
చూచి మరు డంపిన మోహినీసుదతివలెనె వచ్చి నిలిచి
యోచక్కని ముద్దుసామి యొంటి నుండ మేర గాదని
లేచి వచ్చి మాయింటిలో బవళించమనె గాబోలు ॥పర॥
ఎన్నగ మధురాపురీశుడైన మువ్వగోపాలుడు
నన్ను మరుకేళిలో గూడిన నాటనుండి యన్య మెఱుగడు
చిన్నెలవాడుగాడమ్మ చెలియరో గాంభీర్యశాలి
కన్నెరో నే దగ్గఱ లేని కొంతాళాన నైనట్లుగా గాబోలు. ॥పర॥

రసహృదయు లగు సదస్యు లెల్లరు క్షేత్రజ్ఞుని సంగీతాభినయనములను వేనోళ్ళ కీర్తించిరి. రసికాగ్రేసరుఁడగు తిరుమలేంద్రుఁడు బ్రహ్మానందపరవశుఁడై క్షేత్రయ్యగారిని ఘనముగా సత్కరించి ధన్యుఁ డయ్యెను. పిమ్మట క్షేత్రజ్ఞుని 'తన యెదుట గూర్చుండ మని' నియోగించి తిరుమలేంద్రుఁ డమ్మహనీయుని మఱికొన్ని పదములు పాడు మని కోరెను. క్షేత్రయ్య రెండువేల పదములు పాడి సభికుల సన్నుతిని చూఱగొనెను.

౫

ఆనాఁడు రామప్పయ్య గృహము బంధుమిత్రాదులతో కిటకిటలాడుచుండెను. దాసదాసీజనము నవ్వుమొగములతో నటునిటు విద్యుల్లతలవలె పరుగులిడుచుండెను. 'ఇవి కావలయును. అవి కావలయును. వేళ యగుచున్నది-' అను పురోహితుల పురమాయింపులు స్ఫుటముగ వినబడుచుండెను. ముసలి ముత్తయిదువ లక్కడక్కడ గుంపులుగా చేరి తమ కాలపు పాటలు పాడుకొనుచు సమయము లభించినప్పు డెల్ల జవ్వనుల మనఃప్రవృత్తిని విమర్శించుచుండిరి. వీరి పాటలు వినుచు లేఁబ్రాయపు నెలఁతలు వృద్ధలను వేళాకోళము పట్టించుచుండిరి. పురుషులు కొందఱు వేదాంతచర్చ సలుపుచుండిరి. కొందఱు వచ్చిపోవు పేరటాండ్రను చూచియు చూడనట్లు నటించుచు లోకాభిరామాయణము ముచ్చటించుచుండిరి. కొందఱు సోమరులు గుఱ్ఱులు వెట్టుచు నిద్రానిమగ్నులై యుండిరి.

ఆనాఁడు రామప్పయ్య మనుమని బారసాల. నాఁటి సాయంసమయమున తిరుమలేంద్రుఁడు తన దేవేరులతోఁగూడి రామప్పయ్య గృహమునకు విజయము చేసెను. మంత్రులు, దండనాథులు, పండితులు, కవులు-ఎందఱెందరో యా సందర్భమున వేంచేసియుండిరి. తిరుమలశౌరి నాయనయ్య కెదురుగాఁ జని రామప్పయ్య, శివరామయ్య దంపతులు పాండ్యమండలాధీశ్వరుని లోనికిఁ గొనివచ్చిరి. రాజపరివారము నుచితాస

నముల నలంకరింపఁజేసి రామప్పయ్య యాగంతుకుల నెల్లరిని చందన తాంబూలాదికముతో యథావిధిగా సత్కరించెను. పిమ్మట బంగరుటుయ్యాలయందు పొత్తిళ్లలో నిదురించుచున్న పసిపాపను శివరామయ్యభార్య స్వయముగాఁ గొనివచ్చి అచ్యుతరఘునాథమ్మవారి కొసఁగెను. ఆమె యా పసికూనను నెత్తుకొని ముద్దాడునంతలో నా బుడుతఁడు మేల్కొని కెవ్వన నేడ్వసాగెను. అచ్యుతరఘునాథమ్మ సముదాయించిచూచెను. అంతకంతకు రోదనము శ్రుతిమీఱి పోవుచుండెను. తిరుమ లేంద్రుఁడును సముదాయించెను. కాని లాభము లేదయ్యెను. పిమ్మట శివరామయ్య భార్య యా బుడుతని తన చేతుల లోనికి తీసికొని ముద్దాడెను. తోడనే రోదనము మటుమాయ మయ్యెను. ఒక్కసారిగ నటనున్నవా రెల్లరు నవ్విరి.

తిరుమలేంద్రుఁడు నవ్వు నాపుకొనుచు రామప్పయ్య నుద్దేశించి 'చూచితిరా మీ మనుమని పట్టుదల. ఇతనిలో మీ పోలిక కానరాకున్నను మీ పట్టుదలమాత్రము మూర్తీ భవించి యున్నది' అనెను.

అందఱు మరల పెద్దగ నవ్విరి. రామప్పయ్యకుఁ గూడ నవ్వు వచ్చెను. ఇంతలో 'పావన మధురానిలయే, పాండ్య రాజతనయే' అనుపాట వినబడెను. తిరుమలశౌరి నాయఁ డ దేమది? అని ప్రశ్నించెను. రామప్పయ్య మందహాసము సలుపుచు 'ప్రభువులు చిత్తగింపవలయును. గానసభ జరుగు చున్నది. తమ యాజ్ఞ యైనచో మన మచ్చటికి పోవుదము' అనెను.

ప్రత్యేకముగ నలంకృత మయినట్టి యొక వేదికపై నాసీనురాలై గాయని యొకర్తె గానము చేయుచుండెను. ఆమె లావణ్యలతిక. అమూల్యాభరణములతో నామె గళసీమ నిండియుండెను. నెన్నుదుట నున్న కస్తురిగీరు నామము, తీర్చి దిద్దిన కనుబొమలు, ఓరవేసిన కొప్పు, సిరులులొలుకు విశాల నయనములు, ధరించిన మధుర పట్టుపుట్టము—ఆమె సహజ సౌందర్యమునకు వన్నెలు చిన్నెలు సమకూర్చెను.

తిరుమలశౌరి సభాస్థలికి వచ్చినతోడనే గాయని సవిన యముగ నతనికి నమస్కరించి కల్యాణీరాగము నాలాపింపఁ దొడగెను. ఆలాపన ముగిసినపిమ్మట పల్లవిని, అనుపల్లవిని క్రమముగ పాడెను. చిట్టస్వరము వేయుచు చరణము పాడ సాగెను. అపుడు జంత్రీవాద్యములవారు తమ బలాబలములు తెల్పుకొన నుద్యుక్తు లయిరి. ఒకరిని మించి మఱొకరు తమ పాండిత్యమును ప్రదర్శించిరి. పాట ముగిసెను. శ్రోతలు తన్మయత్వము చెందిరి.

తిరుమలేంద్రుఁడు మిక్కిలి సంతసించి యా గాయనిని బహువిధముల పొగడెను. అచ్యుత రఘునాథమ్మ మైమఱచి, 'తంజావూరి నట్టువకత్తెలుకూడ నీగాయనికి సరిరారు—' అనెను. అనంతరము తిరుమలేంద్రుఁడు సపరివారముగ రాచ నగరునకుఁ జనెను.

అది రాత్రి సమయము. దళవాయి రామప్పయ్య భోజనము గావించుకొని విశ్రామార్థము సుందరోద్యానము నకుఁ జనెను. అట నంతకుమున్నే ప్రత్యేకముగ నమర్పఁ

బడియున్న శయ్యపై నాసీనుఁడై దళవాయి తమ్ములములు వేసికొనుచుండెను. ఇంతలో వేగులవాండ్రిద్దఱు రామప్పయ్యను సమీపించి వినయాంజలి ఘటించిరి. వారిని నుచితాసనములపై కూర్చుండ నియోగించి, 'విశేషములు లేవుగదా?' అనెను. 'లేకేమి ప్రభూ - యుద్ధము సంభవించునట్టి సూచనలగపడుచున్నవి' అని చారముఖ్యుఁడు సవినయముగ నుడివెను. వేసికొనుచున్న తమ్ములపాకును క్రిందపారవైచి 'తిరిగి యుద్ధము సంభవింప నున్నదా' అనుచు దళవాయి మందహాసమొనర్చెను. 'మన పాళెపు గారలెల్లరు ప్రభువులవారి యెడ వినయ విధేయతలు ప్రకటించుచు సక్రమముగ కప్పములు చెల్లించుచున్నారు. ప్రజలుకూడ ప్రభువులవారి యందను రక్తులై యున్నారు. కాని రామనాథపురమునేలు జడైక దేవ సేతుపతి మాత్రము స్వాతంత్ర్యము ప్రకటించుకొని రాజ్యము చేయ నభిలషించుచున్నాఁడని తెలియవచ్చినది. ఒకవేళ యుద్ధము సంభవించినను నందుకుఁగూడ సిద్ధముగా నున్నాఁడనిగా విన్నాము' అని చారముఖ్యుఁడు నుడివెను. కొంత వడి మిన్నకుండి రామప్పయ్య నవ్వుచు నిట్లనెను.

'ముద్దుకృష్ణప్ప నాయని కాలములో జడైకదేవుని పూర్వులకు తగిన పరాభవము జరగినది. రామేశ్వరమునకు పోవు మధుర యాత్రికులను నిష్కారణముగ సేతుపతులు బాధింపఁ దొడఁగిరి. ఈ విషయము తెలిసికొన్న వెంటనే ముద్దుకృష్ణప్ప నాయనయ్య సేతుపతుల నణచి వైచి వారిని తన సామంతులుగా చేసికొనెను. కడపట పాండ్యమండలా

ధీశ్వరునికి కప్పము చెల్లించుటకును వారు సమ్మతించిరి. ఈ విషయాదికము జగ్గైకదేవ సేతుపతికి తెలియదా? తెలిసియే యిట్లొనర్చుచున్నాఁడు. ఇంతకు జగ్గైకదేవునికి పోగాలము దాపురించినది. లేదేని యిట్టి దుర్బుద్ధి పుట్టదు.' పిమ్మట దళవాయియొద్ద సెలవు తీసికొని వేగులవాండ్రు తమ యిండ్ల కేగిరి.

ఆ రాత్రి రామప్పయ్యకు కునుకు పట్టలేదు. అంతులేని యాలోచనలతో నతని హృత్సీమ నిండియుండెను. జగ్గైకదేవుఁడు కప్పము చెల్లింప నిరాకరించుననియు, తత్ఫలితముగ యుద్ధముతప్పక సంభవించు ననియు నతఁడు నిశ్చయించెను. జగ్గైకదేవుఁడు బుద్ధిబలము,బాహుబలము గలవీరుఁడని చారులవలన తెలిసికొని యుండుటచే నతనిని జయింపవలయు నని దళవాయి నిశ్చయమనస్కుఁ డయ్యెను. ఈ యవకాశమును వినియోగించుకొని మైసూరు, తంజావూరు పాలకులును మధురపై దండెత్తి వచ్చెదరేమో యని యతడు సంశయించెను. ఎప్పుడెప్పుడు ఈ విషయాదికమును తిరుమలశౌరితో చర్చింతునా యని యతఁ డారాటము చెందెను.

తెల్లగ తెల్లవారెను. ఆహారాన్వేషణార్థమై విహంగములు వ్యోమవీథిని పరుగు లిడుచుండెను. ఝుంకారము సలుపుచు భృంగములు మకరందాస్వాదనము సలుపుచుండెను. మీనాక్షీ సుందరేశ్వరాలయమున మంగళకైశికి రాగములో నొకపాట పాడఁబడుచుండెను.

రామప్పయ్య నిత్యకర్మానుష్ఠానమును ముగించుకొని యిలువేల్పగు మీనాక్షీ సుందరేశ్వరుని మనసార ధ్యానించి యంతఃపురమునకుఁ జన నుద్యుక్తుఁడగు చుండెను. అప్పుడే చతుర్వేదమంగలమునుండి యేతెంచిన శివరామయ్య మామ గారి కొక లేఖ నొసఁగెను. దానిపై వైద్యనాథయ్య ముద్ర యుండెను. అత్యాదరమున జాబును గ్రహించి పలుమాఱు లా యుత్తరమును రామప్పయ్య చదివెను. అతనికి మితిలేని సంతోషము కలిగెను.

'శివరామయ్య! ఈనాఁటికి నాకు మనశ్శాంతి లభించి నది. నా చిరకాలవాంఛ యీడేరినది. అనుభవింపఁదగిన సౌఖ్యములను మహారాజువలె ననుభవించితిని. సత్ప్రజాసన్న తిని చూఱగొంటిని. అయినను నా చిరకాలవాంఛ నెఱవేర లేదని యిన్నాళ్లు కుందుచుంటిని. అది నేఁటికి ఫలోన్ముఖము నకు వచ్చినది. ఎంతటి యదృష్టవంతుఁడను నేను!' అనుచు నతఁడా కమ్మను మరల చదివెను. 'మన గ్రామములో శివాల యము లేనికొఱత నేటితో తీరిపోయినది. ఆలయనిర్మాణ మత్యద్భుతముగా నున్న దని పలువురు చెప్పుకొనుచున్నారు. పెక్కు గ్రామములనుండి తీర్థప్రజవలె జనులు వచ్చి కోవెలను సందర్శించి పోవుచున్నారు. కుంభాభిషేకము, నవగ్రహశాంతి మున్నగునవి కూడ యథావిధిగా జరిగినచో మన బాధ్యత చాలవఱకు తగ్గిపోవును. కనుక పెద్దలతో సంప్రతించి తగిన యేర్పాట్లు చేయవలసినది.'

పిమ్మట గద్గదకంఠుఁడై దళవాయి రామప్పయ్య యిట్లనెను.

"ఈ వృద్ధాప్యములోఁగూడ యుద్ధములందు పాల్గొనుచు జీవితము గడపుచున్నాను. యుద్ధభూమియే మరణశయ్యయగునేమో యను సంశయము బాధించుచున్నది....శివ రామయ్యా! ఆలయమును నీ స్వాధీనము చేయ సంకల్పించితిని. నిత్య పూజయందుగాని, దీపధూప నైవేద్యాదులయందుగాని యెట్టి లోపము రాకుండ చూడుము. వ్యక్తత వచ్చినవాఁడవు. ఇక మఱేమియు నీకు చెప్పనవసరము లేదు."

మామగారి భావమును గ్రహించి శివరామయ్య సదుత్తరము నుడివెను. రామప్పయ్యకు సంతోషము కలిగెను. అప్పటికి కొంచెము ప్రొద్దెక్కెను. హజారమున నెనిమిది గంటలు కొట్టిరి. దళవాయి యొక శకటమునం దధివసించి యంతఃపురాభిముఖుఁడై చనెను.

తిరుమలేంద్రుఁడు కొలువు తీరి యుండెను. మంత్రులు, ప్రముఖులును తమ స్థానములలో నాసీనులై యుండిరి. రామనాథపురమునుండి వచ్చిన వార్తాహరులు తిరుమలశౌరికి సర్వవిషయములు నివేదించుచుండిరి. అంతలో రామప్పయ్య కొలువుకూటమునకు వచ్చెను. వార్తాహరులు సెలవు తీసికొని తమ నివాసములకుఁ జనిరి. పిమ్మట కొంతతడవు మంత్రులతోను, సైన్యాధికారులతోను సమాలోచనము జరపి తిరుమలశౌరి రామప్పయ్యతోఁ గూడి రహస్యమందిరమునకు వెడలెను.

రాజ్యవ్యవహారములు చర్చించిన పిమ్మట తిరుమల శౌరి జడైకదేవుని విషయము ప్రస్తావించుచు సేతుపతితో యుద్ధము చేయుట లాభకరముగా నుండదేమో యని పలికెను. సేతుపతితో యుద్ధము చేయ నిశ్చయించిన రామప్పయ్య కీ మాటలు నచ్చలేదు. కొంతవడి మిన్నకుండి దళవాయి నుడివెను. "ప్రస్తుతము జడైకదేవునితో యుద్ధము చేయవలయు నని నేనును కోరుట లేదు. కాని యిది తప్పనిసరి యయినది. మన వార్తాహరులు సేతుపతిని సందర్శించి పాండ్యమండలాధీశ్వరునికి కప్పము చెల్లింపవలయు నని నుడువుచు తమ తాఖీదును జడైకదేవుని సమక్షమున నుంచిరట. అన్యథా తమరు భావింపవలదు – అనాదరముగా తాఖీదును గ్రహించి పాండ్యమండలాధీశ్వరునికి కప్పము చెల్లింప నవసరము లేదనియు, కప్పము కావలసిన యుద్ధమున జయించి తీసికొనవచ్చు ననియు, తమతో తెలుగువారు యుద్ధము చేయుటకు వెనుకంజ వేయుదు రనియు సేతుపతి గర్వోక్తు లాడెనట! కనుక అతడు యుద్ధమునకు సిద్ధముగా నున్నాడను."

ఈ విషయమును వార్తాహరులు నుడువలేదే యనుచు తిరుమలశౌరి కను బెట్టు జేసెను.

కొలువుకూటమున నీ విషయము వెల్లడి చేయవల దని వార్తాహరులతో చెప్పితి నని దళవాయి ప్రత్యుత్తర మొసంగెను.

'జడైకదేవ సేతుపతికి తగినశాస్తి చేయవలసినదే. సింహళద్వీపమును జయించిన తెలుగువారు సేతువును సం

రక్షించుటకై నియోగింపఁబడిన మఱవలతో యుద్ధము చేయుటకు వెనుకంజ వేయుదురా?

'సేతుపతిని జయించి తీరవలయు నని నిశ్చయించితిని. అదియునుగాక సముద్రతీరమందుఁ గల ప్రదేశములలో ప్రస్తుతము పాశ్చాత్యులు విశేషాధికారము చెలాయించుచున్నారు. సేతుపతులుకూడ నధికారము సంపాదించిరి. కనుక వీరిని మనసామంతులుగా చేసికొననిచో వీరివలన నెన్నటికైనను మనకు ముప్పు వాటిల్లగలదు' అని రామప్పయ్య పలికెను. 'అవును-మీరు నుడివినది వాస్తవము కాదనను. ఎందులకోగాని మా పూర్వులు సముద్రప్రాంతమును జయించక మానివేసిరి. నేనును వారి మార్గమునే యనుసరించితిని-' అనుచు తిరుమలేంద్రుఁడు సేతుపతితో సమరము గావించుటకు నిశ్చయమనస్కుఁడయ్యెను. యుద్ధమును స్వయముగా సాగింపుమని రామప్పయ్యను కోరెను. అతఁడును ప్రభు నాజ్ఞను సహర్షముగ శిరసావహించెను.

ఇంతలో నొక ద్వారికుఁ డేతెంచి ప్రభువులకు జయము, జయమనుచు పలికెను. 'ఎవరైన వచ్చియున్నారా?' అని దళవాయి ప్రశ్నించగా, 'అవును ప్రభూ - రామనాథపురము నేలు జడైక దేవ సేతుపతిగారి తమ్ముఁడు తంబి వచ్చియున్నారు. తమ దర్శనార్థమై వేచియున్నా'రని ద్వారికుఁ డనెను.

తిరుమలేంద్రుఁడు దళవాయినిచూచి మందహాస మొనరించి, 'చాల విచిత్రముగా నున్నది. తంబి రాకకు కారణ మేమైయుండునో' అనెను.

తంబిని ప్రవేశపెట్టుమని ప్రభునాజ్ఞ యయ్యెను. కావా రికుండు వెడలిపోయిన కొంత సేపటికి తంబి కొలువుకూటము నకు విచ్చేసి తిరుమలశౌరిని సందర్శించెను. దళవాయికి ంచె మెడముగా నున్న యొక యున్నతాసనమున తంబి యాసీనుం డయ్యెను. అనంతరము దళవాయి యభిమతాను సారము తంబి రామనాథపురమును గూర్చి నుడువం దొడం గెను.

"మా అన్నగారు సేతుపతి యయిన నాంటినుండియు తెముయెడ విముఖత్వము వహించియున్న విషయము తమకును తెలిసియుండును. తుదకు కప్పము చెల్లించుటకును మా అన్న గారు నిరాకరించిరి. ఇంకొక ముఖ్య విషయము తమకు తెలియం జేయుటకై తమ సన్నిధికి వచ్చియున్నాను. మా అన్నగారు పురుషసంతానవిహీను లగుటచే మా చెల్లెలు కణ్ కాణు నాచ్చియార్ పుత్రులలో జ్యేష్ఠుండు రఘునాథ దేవుని దత్తత చేసికొనిరి. అతనికే రామనాథపురమును వశము చేయుదు నని మా అన్నగారు ప్రకటించియున్నారు. కనుక మా అన్నగారి తదనంతరము రఘునాథదేవుడు సేతుపతి అగును...."

'ని నోట కరక్కాయ పడిన దన్నమాట' అని రామప్పయ్య ఛలోక్తిగా ననెను. తిరుమలశౌరి మందహాసము చేసి మిన్నకుండెను. 'తమరు కనికరించినచో మా అన్నగారి ఆటలు సాగవు. నా వంటి దురదృష్టవంతునికి తప్పక తమరు

న్యాయము చేకూర్తురని విశ్వసించుచున్నాను' అని సవినయముగ తంబి నుడివెను.

ఏ పక్షమున న్యాయ మున్నటుల వ్యక్త మగునో, యా పక్షమువారికి సహాయము చేయుట మా అభిమతము. సేతుపతిని గూర్చి తమతో సవిస్తరముగ మాటాడిన పిమ్మట గాని మే మెట్టి నిర్ణయమునకు రాజాల మని తిరుమలేంద్రుడు తంబికి సమాధాన మొసఁగెను.

పిమ్మట తిరుమలశౌరి తన నిజనివాసమునకు నెడలుటతో నాఁటి సమావేశము ముగిసెను. దళవాయి స్వగృహోన్ముఖుఁ డయ్యెను. తంబి రాజమందిరాభిముఖుఁడై చనెను.

ఆనాఁడు మధురానగరము కలకలలాడు చుండెను. పాండ్యమండల మంతయు మధురయందే యుండెను. ఎచట చూచినను – ఎవరినోట విన్నను – రామప్పయ్యను గూర్చిన ప్రసంగములే. అంతు లేనికోలాహలము! రామప్పయ్య సమర సన్నాహములలో మునిఁగియుండెను. జామాత లగు శివ రామయ్య, కొండప్పయ్యలు మామగారికి సాయపడుచుండిరి. దళవాయి రంగన్ననాయఁడు రామప్పయ్యకు కుడిభుజముగా సంచరించుచుండెను. పాండ్యమండల మందలి డెబ్బదియిద్దఱు పాళెగాండ్రును దళవాయి యాజ్ఞలు నిర్వర్తించుచు తమ సైన్యముల నాయత్తపఱుచుచుండిరి. బెబ్బులిని గూడ చీల్చి చెండాడఁగల బాహుబలసంపన్ను లగు మధురవీరులు హాహా కారములు సలుపుచుండిరి. ఆ హాహాకారములతో మధురా నగరము మాఱుమ్రోఁగి పోవుచుండెను.

నాఁటి యుదయము రామప్పయ్య పెందలకడనే మేల్కొనెను. ఇలువేల్పగు మీనాక్షిని పూజించెను. పిమ్మట వైద్యనాథయ్యకు నమస్కరించి యతని యాశీస్సు పొందెను. తదవసరమున వైద్యనాథయ్య యిట్లనెను: "జగ్దైకదేవ సేతుపతి సామాన్యుఁడు కాఁడు. పేరుపెంపులు వహించిన యుద్ధవీరుఁడని విన్నాను. కాని మహాస్వాభిమాని. నిద్రించుచున్న పుల్లిని గూడ లేపి దానితోఁ బోరాడి జయశ్రీ వరించునట్టి మన తెలుఁగువీరులు వట్టిదద్దమ్మ లని యతని నమ్మకము. ఇట్టి స్వాభిమానిని జయించుటయే వీరోచితలక్షణముగా గణింపఁబడును. ఇంతకు మున్ను మన తెలుఁగుయోధులు తుంబుచ్చినాయఁడును కండిరాజును-మున్నగువారిని శిక్షించి శాంతి భద్రతలు సంరక్షించినారు. నీవును, రంగన్ననాయఁడును మైసూరు సేనాని కుమారయ్యకు తగిన పరాభవము చేసి పాండ్యమండలాధీశ్వరుని గౌరవమును నిలువ బెట్టితిరి. ఎట్లైనను సరే సేతుపతిని గూడ జయించి చిరయశస్సు సంపాదింపుము. తెలుఁగు వీరులు జగదేకవీరు లని దేశదేశాలవారు తెలిసికొనవలయును. దళవాయిగా నున్నందుకు ఇది నీ విధి. జయశ్రీ నిన్ను వరించునుగాక! అప్పుడే మనము తిరుమలేంద్రుని నిజమైనభృత్యుల మగుదుము. మీనాక్షీ సుందరేశ్వరులే నిన్ను రక్షింతురుగాక!"

అటుపిమ్మట రామప్పయ్య మీనాక్షి అమ్మవారి యాలయమునకుఁ జనెను. అతనితో రంగన్ననాయఁడు, శివరామయ్య మున్నగు వీరవతంసు లుండిరి. ఆలయబహిర్ద్వార

మున రామప్పయ్యకును నతని పరివారమునకును నాలయాధి కారులు సుస్వాగత మొసఁగిరి. పురాణపురుషు లగు మీనాక్షీ, సుందరేశ్వరులను రామప్పయ్య పూజించెను. ప్రత్యేకముగ నభిషేకము జరగెను. అమ్మవారి గళసీమ నలంకరించియున్న సుమహారములలోఁ గొన్నింటిని తీసి రామప్పయ్య రంగన్న నాయకులకు వేసిరి. తీర్థము, ప్రసాదము మొదలగు వానిని సభక్తికముగ స్వీకరించి, కొంతతడవు తిరుమలేంద్రుని సుందర మందిరమున విశ్రమించి రామప్పయ్య సపరివార ముగ రాచనగరునకుఁ జనెను.

తిరుమలశౌరి నాయనయ్య కొలువు తీరి యుండెను. మంత్రులు, డెబ్బదియిద్దఱు పాళెగాండ్రు, వీరవతంసులు-పలు వురు సభాస్థలిలో నాసీనులై యుండిరి. నాఁటి సభానిమిత్తమై కొలువుకూటము కన్నులపండువుగా నలంకృతమై యుండెను. రామప్పయ్య సభాభవనమునకు వచ్చినతోడనే తిరుమ లేంద్రుఁ డతని కెదురేగి దళవాయిని సాదరముగా లోనికిఁ గొని వచ్చి యొక యున్నతాసనమున గూర్చుండఁ జేసెను. రంగన్ననాయఁడు, శివరామయ్య మున్నగు ప్రముఖులును తిరుమలేంద్రునికి ప్రక్కగా నాసీను లయిరి. నృత్తగీతాదులతో సభాప్రారంభ మయ్యెను. తిరుమలేంద్రుని యభీష్టానుసారము రంగన్ననాయఁ డొక పత్రమును సభవారికి చదివి వినిపించెను.

"రామనాథపురమును పరిపాలించే జడైకదేవ సేతు పతి కప్పం సక్రమంగా చెల్లించుటకు నిరాకరించినందువల్లనూ, తమ్ముడైన తంబికి అన్యాయం చేసినందువల్లనూ, మేము సేతు

పతితో యుద్ధం చేసేటందుకు తలపెట్టి ఆ కార్యభారము నంతా మా దళవాయి ప్రధాని రామప్పయ్యగారిమీద పెట్టడ మైన దని యిందుమూలముగా మా ఏలుబడిలో వుండే యావన్మం దికీ తెలియజేస్తున్నాము. ఈ సందర్భంలో పూర్వపు షర తుల ప్రకారం మాకు సహాయం చేసే నిమిత్తం వచ్చినటు వంటి పాళెగా ర్లందరినీ ప్రత్యేకంగా అభినందిస్తున్నాము. రేపు ప్రొద్దున దళవాయి ప్రధాని రామప్పయ్యగారు మా సైన్యములతోను, పాళెగార్ల సైన్యములతోను రామనాథ పురముపై దండెత్తి వెళ్లుటకుగాను రామనాథపురానికి తరలి వెళ్లనున్నారు. శ్రీ మీనాక్షీసుందరేశ్వరుల స్థిరతర కరుణా కటాక్షములకు పాత్రులైన మా దళవాయి ప్రధానిగారికి విజయము కలుగుగాక యని మధుర మీనాక్షీ దేవిని ప్రార్థిస్తు న్నాము.'' జయజయధ్వానములతో కొలువుకూటము మారు మ్రోఁగిపోయెను.

అనంతరము తిరుమలేంద్రుఁడు చందనతాంబూలాది కముతో దళవాయి రామప్పయ్యను సత్కరించెను. చీని చీనాంబరములు, ఆభరణములు – మున్నగువాని నొసఁగి దళవాయిని గౌరవించెను. అటులనే దళవాయి రంగన్న నాయఁడు, శివరామయ్య మున్నగువారిని గూడ తిరుమలశౌరి యథోచితముగ సత్కరించెను. 'ఆజన్మాంతము తమకు కృతజ్ఞుఁడనై యుందును. మీనాక్షీ సుందరేశ్వరుల కరుణా కటాక్షములవలన మనకు జయము లభింపఁగలదు –' అనుచు దళవాయి తన కృతజ్ఞతను తెలిపెను.

# ౬

పల్యంకికా వాహనుఁడై రామప్పయ్య రామనాథ పురాభిముఖుఁడై సపరివారముగ బయల్వెడలెను. పల్లకికి ముందు భాగమున నాశ్వికదళ ముండెను. పల్లకి కిరువైపుల రంగన్ననాయఁడు, శివరామయ్య, కొండప్పయ్య మున్నగు వా రుండిరి. వారి ననుసరించి మందూరి పాపయ్య, కోటప్ప నాయఁడు, విరూపాక్షినాయఁడు, లింగమనాయఁడు, కామాక్షినాయఁడు, బూచినాయఁడు, ఇరువప్పనాయఁడు, కోటయ్యరెడ్డి, మీరాసాహెబ్, అహమద్ సాహెబ్ - మున్నగు పాళెగా ర్లుండిరి. వారికి వెనుక మహాసాహసు లగు యుద్ధవీరులు నడచుచుండిరి. ఏనుగుల ఘీంకృతులు, గుఱ్ఱముల సకిలింపులు, భేరీభాంకృతులు, శంఖారావములు, డమరు ధ్వనులు, వీరవతంసుల హాహాకారములు, విజయధ్వానములు మిన్ను ముట్టెను.

మధురనుండి వెడలిన సైన్యములు చిన్నరావూరి పాలెము మీఁదుగాఁ బోయి వండియూరుకోటలో విడిసెను. అచట శిబిరములు వేసికొనిరి. రామప్పయ్య కొలువుదీరి యా పరిసరములందున్న ప్రజల నుద్దేశించి 'మన ప్రభువులు ముద్దు తిరుమలశౌరి నాయనింవారి యాజ్ఞానుసారము రామనాథ పురముపై దండెత్తుటకు మేము పోవుచున్నాము. ఈ సందర్భ మున మీయందఱ సహకార సానుభూతులు మాకు మిక్కిలి యావశ్యకములు. మీ రందఱు ధైర్యముగా నుండుఁడు-' అని

నుడివెను. పిమ్మట రామప్పయ్య సైన్యములు త్రిభువనము చేరెను. అటనుండి మానామధురకు ప్రయాణము సాగించిరి.

మానామధురకు చేరినపిమ్మట నప్పటికప్పుడు శిబిరములు నిర్మింపఁబడఁగా నందు ససైన్యముగా రామప్పయ్య విడిసెను. శంఖము లూదఁబడెను. భేరీ డమారములు మ్రోగించిరి. పాండ్యమండలాధీశ్వరుఁడు శ్రీ శ్రీ ముద్దు తిరుమల శౌరి నాయనింవారి సైన్యములు రామనాథపురముపై దండెత్తనున్నవి - అని మధురవీరులు ప్రకటించిరి. ఈ దృశ్యమును తిలకించిన సేతుపతివేగులవాండ్రు భయవిహ్వలులై శరవేగమునఁ జని జడైక దేవ సేతుపతిని సందర్శించిరి.

'ప్రభువులకు జయము - పాండ్యమండలాధీశ్వరుఁడు తిరుమలశౌరి నాయనింవారి సైన్యములు మానామధురలో విడిసియున్నవి. వారి శిబిరములలో నొకటే కోలాహలముగా నున్నది. మనపై దండెత్తుటకు తాము దండు విడిసి యున్నామని దళవాయి ప్రధాని రామప్పయ్యగారు ప్రకటించినారు. వారిని మేము కన్నులార చూచితిమి. ఈ విషయమును తమకు తెలియఁజేయ నుద్దేశించి తమ సన్నిధికి వచ్చితిమి' అని విన్నవించిరి.

జడైక దేవుఁడు పెద్దపెట్టున నవ్వెను. అంతలో నతఁడు రుద్రుఁడై, 'ఏమీ! రామప్పయ్య కండకావరము! ఆ బాపనికి వేఱు పనిపాటులు లేవు కాఁబోలు. మా విషయము తెలిసి యుండియు మాతో యుద్ధము చేయ సాహసించెనా! తిథి వార నక్షత్రములు చెప్పుకొను బాపని కింత బాహుబల

మెక్కడినుండి వచ్చినదో! అతఁడు మాతో యుద్ధము చేయు దునని ప్రకటించినంత మాత్రముననే భయభ్రాంతులై మీరు మాయొద్దకు వచ్చినారు...సిగ్గుచేటు—అతనికండ్లు పీకి, అతని పిలకజుట్టుకు టెంకాయ కట్టి యా రామప్పయ్యను నడవిలో విడవవలయును. అప్పుడే యతని గర్వము మఱు మాయ మగును' అని కఠినోక్తు లాడెను.

మానామధురలో ససైన్యముగా రామప్పయ్య విడిసి యున్నాఁడని తెలిసికొనిన తోడనే మంత్రులు, సైనికోద్యోగులు -మున్నగు ప్రముఖు లెల్లరు సేతుపతి కొలువుకూటమునకు విచ్చేసిరి. వచ్చిన ప్రముఖులను చూచినంతనే జడైక దేవునికి మితి లేని యుత్సాహము కలిగెను. కొంతతడవు మౌనము వహించి, సహజగంభీర స్వరముతో సేతుపతి మాటలాడసాగెను. అంతలో సేతుపతి యల్లుఁడును, మఱవ సైనాధ్యక్షుఁడును నగు వన్నిదొరకూడ వేంచేసి మామగారికి ప్రక్కన నున్న యున్నతాసనముపై నాసీనుఁ డయ్యెను.

'మానామధురలో రామప్పయ్య ససైన్యముగ శిబిరములు నిర్మించుకొని యున్నాఁడని మన వేగులవాండ్రవలన తెలిసికొంటిని. పాండ్యమండలాధీశ్వరునికి కప్పము చెల్లింప నిరాకరించిన విషయము మీ కెల్లరికి సువిదితమే. ఇదియే యుద్ధకారణమై యుండవచ్చును. అయినను కప్పము చెల్లించుచు తిరుమలశౌరి నాయనయ్యకు సామంతుఁడుగా నుండుటకు నే నంగీకరింపను. ఇదియే నా నిశ్చితాభిప్రాయము.

ఈ యభిప్రాయముతో మీరును నేకీభవింతు రని నేను నమ్ము చున్నాను.''

సేతుపతి పలికిన పయి మాటలనుబట్టి యుద్ధము తథ్య మనిసభికు లెల్లరు సునాయాసముగ గ్రహించిరి. పాండ్యమండ లాధీశ్వరునితో కయ్యమునకు దిగుట శ్రేయస్కరము గాదని కొందఱు తమలో తామనుకొనిరి. కొందఱు సేతుపతి ధైర్యో త్సాహములను ప్రశంసించిరి. యుద్ధము సంభవింపకున్న మేలుగా నుండు నని కొంద ఱనుకొనిరి. ఏమి నుడివిన నేమి సంభవించు నో యని సంశయ మనస్కులై యెల్లరు కుక్కినపేలవలె మౌనము వహించిరి. ఒక్కరు మాటాడని హేతువుచే సేతు పతి మరల మాటాడ యత్నించునంతలో నొక వృద్ధుఁడు లేచి సవినయముగ నిట నెను.

''ఈ వృద్ధుని మాటలను ప్రభువులును, సభికులును చిత్తగింతు రని యాశించుచున్నాను. ప్రస్తుత పరిస్థితులలో యుద్ధము మనకు శ్రేయోదాయకముగా నుండ దని నా విశ్వా సము. దళవాయి ప్రధాని రామప్పయ్యగారు మహాసాహసుఁ డగు యుద్ధవీరుఁ డని నేను వేఱుగా నుడువ నవసరము లేదు. ఆతనికి సహాయముగ డెబ్బదియిద్దఱు పాళెగాండ్రును వచ్చి యున్నారు. వారి యుద్ధసన్నాహములు పెద్దయెత్తున జరగు చున్నవి. అట్టి వారితో పోరాడుట ప్రస్తుతము మనకు లాభ కారి కాఁజాలదు. అదియునుగాక పాండ్యమండలాధీశ్వరుఁడు ముద్దు కృష్ణప్పనాయనిం వారికాలము నుండియు సేతు

పతులు సక్రమముగ కప్పము చెల్లించుచున్న విషయము తమకు సువిదితమే.''

క్రోధోద్రిక్తుఁడై 'చాలుచాలు మీ మాటలు – ఆ తెలుఁగువారిని చూచి భయపడునట్టి పిఱికివారము కాము మేము. మహాబలాఢ్యుఁడని ప్రసిద్ధి వహించిన సూరప్పయ్యను జయించిన మఱవ వీరులకు దళవాయి రామప్పయ్య యొక లెక్కలోని వాఁడు కాఁడు' అని సేతుపతి పలికెను.

వెంటనే యా వృద్ధుఁడు లేచి కొలువుకూటమును చూచి సేతుపతి నుద్దేశించి 'ప్రభూ – యుద్ధము చేయుఁడు. రామనాథస్వామి మీకు జయము చేకూర్చునుగాక...ఇఁక నేను పోయి వత్తును' అని కొలువుకూటమునుండి వెడలి పోయెను.

ఆ వృద్ధుఁడు జడైకదేవ సేతుపతి తండ్రి యగు కుట్టాన్ సేతుపతి కాలమునుండియు రామేశ్వరాలయమున నర్చకుఁడుగా నుండెను. అతఁడనిన సేతుపతులకు విశేష గౌరవము. సేతుపతులు రామనాథస్వామివారి భక్తులు. వీరు మఱవకులస్థులు; కాని సేతువును సంరక్షించుటకై నియోగింపఁబడిన నాఁటినుండియు వీరికి సేతుపతులను బిరుదము కలిగెను. కొలువుకూటమునుండి యా వృద్ధుఁడు వెళ్ళిపోవుట యశుభసూచకమని కొందఱుతలఁచిరి. సేతుపతి యాలోచనానిమగ్నుఁ డయ్యెను.

సేతుపతి యధీరుఁ డయ్యెనేమో యని శంకించి వన్ని దొర మాటాడఁదొడఁగెను. 'దళవాయి ప్రధాని రామప్పయ్య

గారు మహాసాహసుఁడగు యుద్ధవీరుఁ డని నాకును తెలియును. ఈ వృద్ధాప్యములోఁగూడ నతనికీ యుద్ధములెందుకో తెలియ రాకున్నది. ఏ గుడిలోనో పూజ చేయుచు హాయిగా కాలము గడపవచ్చునుగదా! గుళ్లుగోపురములా లెక్కకు మిక్కిలిగా నున్నవి...దళవాయి రామప్పయ్యతో యుద్ధ మొనర్చుటకు మఱవవీరులు వెనుదీయ రని పాండ్యమండలాధిపతి తెలిసికొన వలయును. ఎట్లయినను సరే మధురవారిని జయించి మన దేశ మును శత్రువుల బారినుండి కాపాడుకొనుట మన విధ్యుక్త ధర్మము. ఈ ధర్మనిర్వహణములో రామనాథస్వామి మనకు తోడ్పడు నని నా విశ్వాసము.'

సభ్యుల హర్షధ్వానములు కొలువుకూటమున మాఱు మ్రోఁగెను.

సేతుపతికి నుడువ నలవి కాని సంతోషము కలిగెను. వన్నిదొరను మెచ్చుకొని 'ఎవరెన్ని చెప్పినను సరే యుద్ధము మాత్రము కొనసాగవలసిన దే. యుద్ధసన్నాహములను నీవే స్వయముగా చూడుము. తత్క్షణమే బుడతకీచుల సైన్యాధి కారికి సహాయము చేయవలసినదిగా లేఖ వ్రాయుము. అటు లనే కొచ్చిన్ రాజునకుఁగూడ లేఖ వ్రాసి పంపింపుము. ఇఁక జాగుచేసిన లాభము రవంతయు నుండ'దనుచు జడైక దేవుఁడు లోనికిఁ జనెను.

వన్నిదొర సమర సన్నాహములలో నిమగ్నుఁ డయ్యెను. మఱవ సేనలను మూఁడుభాగములుగా విభజించెను. ఆ విభాగములకు దండనాథులను నియమించెను. సేతుపతి

యాజ్ఞానుసారము బుడతకీచుల సైన్యాధ్యక్షునకును, కొచ్చిన్ రాజునకును లేఖలు వ్రాయించి వారికి పంపించెను. యుద్ధ విషయము తెలిసినతోడనే మఱవ యువకులు చాలమంది సైన్యములో చేరిరి. మఱవ వీరుల సన్నాహములను నెప్పటి కప్పుడు రహస్య వార్తాహరుల మూలమున రామప్పయ్య తెలిసికొనుచుండెను. బుడతకీచులు, కొచ్చిన్ వీరులును సేతు పతికి సహాయము చేయ సమ్మతించిరి. సింహళద్వీప వీరులు కూడ సాహాయ్యము చేయ నంగీకరించిరి. ఈ విషయాదిక మును రామప్పయ్య తెలిసికొనెను. ఎప్పటి కప్పుడు పాళెపు దొరలతోను, శివరామయ్య, రంగన్న నాయకులతోను రామప్పయ్య సమాలోచనములు సలుపుచు క్రొత్త వ్యూహ ములు పన్నుచుండెను. రామప్పయ్య యాజ్ఞానుసారము సైన్యములు మానామధురను వీడి పోగలూరుకోటకు తరలి వెడలెను.

పోగలూరు కోటలో నంతకుమున్నె సేతుపతి సైన్యము శత్రువీరుల నెదుర్కొన సంసిద్ధముగ నుండెను. వైరివీరులను చూచినంతనే సేతుపతి సైన్యము ఫిరంగులు వేసెను. రంగన్ననాయఁడు దుర్గమును ముట్టడించెను. యుద్ధ మారంభ మయ్యెను. కడపట పోగలూరు రామప్పయ్య చేఁజిక్కెను. అచటనే శిబిరములు నిర్మించుకొని మధురవీరులు శాత్రవుల సమరసన్నాహములను గమనించుచుండిరి.

ఈ విషయము జడైక దేవునికి తెలియవచ్చెను. తోడనే యల్లునితో సమాలోచనము జరపెను. తత్ఫలితముగ సేతు

పతి సైన్యములు పాంబన్ కాలువనుదాటి రామేశ్వరమునకు తరలి వెడలెను. అట మఱవవీరులు గుడారములు వేసికొనిరి. అంతకుమున్నే యట బుడతకీచులును, సింహళద్వీప వీరులును శిబిరములు వేసికొని సేతుపతి రాకకై నిరీక్షించుచుండిరి. అంతలో జగ్దైకదేవుఁడును సపరివారముగ వేంచేసెను. వీర వరేణ్యులతో కిటకిట లాడుచున్న యీ ప్రదేశమును చూచి యతడు మిక్కిలి సంతసించెను. పిమ్మట బుడతకీచులు, సింహళ ద్వీప వీరులు - మున్నగువారిని నభినందించుచు సేతుపతి మాటాడసాగెను.

"మీకు మా యభివందనములు. మాకు సహాయముగా మీ రిక్కడికి వచ్చియున్నారు. మాపై మీకుఁగల ప్రేమ నిరుపమాన మని యిందుమూలముగ వ్యక్తమగుచున్నది. ఈ స్నేహభావము శాశ్వతముగా నుండుఁగాక! మీరు ప్రదర్శించు చున్న ధైర్యోత్సాహములను చూచి ముగ్ధుఁడ నైతిని. ఇఁక మనకు తప్పక జయము లభించు నని ధైర్యము కలిగినది. సంశయము లన్నియు పటాపంచ లైనవి. మా యిలువేల్పగు రామనాథస్వామికూడ మనపక్షము వహించు ననువిశ్వాసము కలిగినది. దైవబలము, అంగబలమును గల మనకు తప్పక జయముకలుగును. ధైర్యోత్సాహములతో యుద్ధము చేయుఁడు. అధీరులు మాత్రము కాకుఁడు. దైవమే మనలను రక్షించును గాక!"

అట గుమిగూడియున్న వీరవతంసుల హర్షధ్వాన ములు మిన్నుముట్టెను. "శత్రుసైన్యములను చీల్చి చెండా

డుఁడు. రామప్పయ్యను పరలోకమునకు పంపుఁడు'' - అను నినాదములు బయల్వెడలెను. అంతు లేనియార్భాటము! మేర లేనికోలాహలము!

పిమ్మట సేతుపతి వన్నిదొరతోఁ గూడి రామనాథ స్వామివారి కోవెలకుఁ జనెను. ఆలయాధికారులు వారికి సుస్వాగత మొసఁగి, రాజోచిత లాంఛనములతో వారిని సత్కరించిరి. ఆలయమును ముమ్మారులు ప్రదక్షిణము చేసి, సేతుపతి కోవెలలోనికిఁ జనెను. తదవసరమున బ్రాహ్మణులు కొందఱు వేదాధ్యయన మొనర్చిరి. కవిపుంగవులు సేతుపతిని నాశీర్వదించిరి. సేతుపతి సంతుష్టహృదయుఁడై వారి నెల్లరిని యథోచితముగ గౌరవించెను. ఇంతలో సర్చకులు దైవ ప్రసాదమును గొనివచ్చి సేతుపతికి సమర్పించిరి. సభక్తికముగా ప్రసాదమును గ్రహించి జడైకదేవ సేతుపతి కొంత తడవు వేయికాళ్ల మండపమున విశ్రమించెను. పిమ్మట నెల్లరు తమతమ నివాసములకు వెడలిరి.

సైన్యసమేతముగ సేతుపతి రామేశ్వరమున విడిసి యున్నాఁడని రామప్పయ్య తెలిసికొనెను. తోడనే యా విషయమును రంగన్న నాయఁడు, శివరామయ్య-మున్నగు ప్రముఖులకును తెలియఁజేసెను. వారి నందఱిని సమావేశ పఱిచి 'ప్రస్తుత మొక క్లిష్టసమస్య యేర్పడినది. ససైన్యముగ సేతుపతి రామేశ్వరమున విడిసియున్నాఁడు. బుడత కీచులు, కొచ్చిన్ వీరులు మొదలగువారు సేతుపతికి సహాయముగా వచ్చియున్నారు. సేతుపతితో యుద్ధము చేయుటకు

ప్రస్తుతము మనము పాంబన్ కాలువను దాటి రామేశ్వరమునకు వెడలవలసియున్నది. ఇది మిక్కిలి ప్రయాసతో కూడినది. అయినను వేఱు గత్యంతరము లేదు. పాంబన్ కాలువపై నానకట్ట నిర్మించి, సేతుపతితో యుద్ధము చేయవలయును. ఇందులకు మీ రెల్లరు సమ్మతింతు రని తలంచుచున్నాను-' అని రామప్పయ్య తన యభిప్రాయములు తెలియఁజేసెను. అందఱును సమ్మతించిరి. 'మీ సమ్మతి లభించినందులకు మిక్కిలి సంతసించుచున్నాను. మీ సహకారమే న న్నీపనికి ప్రోత్సహించుచున్నది' అని రామప్పయ్య తన కృతజ్ఞతను తెలిపెను.

మీనాక్షీ సుందరేశ్వరులను పూజించి, దళవాయి ప్రధాని రామప్పయ్య పాంబన్ కాలువపై నానకట్టకు శంకుస్థాపన మొనర్చెను. చూచుచుండఁగనే పని యారంభమయ్యెను. ఉత్సాహముతో మధురవీరు లా యానకట్టను నిర్మింపఁ దొడఁగిరి. రామప్పయ్య వారికి సహాయము చేయుచుండెను. అవసరమైనచో సైనికులతోపాటు దళవాయియు ఱాళ్లు మోయుచుండెను. ఆనకట్ట నిర్మాణమును రంగన్న నాయఁడు పర్యవేక్షించుచుండెను. ఒడలు వంచి మధుర సైనికులు పని చేయసాగిరి. కొన్నాళ్ళలో నానకట్ట నిర్మాణము పూర్తియయ్యెను. 'ఆనాఁడు రామచంద్రుఁడు సముద్రముపై వారధి కట్టెను. నేఁడు దళవాయి రామప్పయ్యగారు పాంబన్ కాలువపై నానకట్ట కట్టెను-' అనుచు పాళెగాండ్రు రామప్పయ్యను

వేనోళ్ళ పొగడిరి. పిమ్మట మధురవీరులు రామేశ్వరమున ప్రవేశించిరి.

ఈ విషయము జడైకదేవ సేతుపతికి సంభ్రమాశ్చర్యములు కలిగించెను. వెంట నున్న వన్నిదొర నుద్దేశించి "చూచితివా ప్రధాని రామప్పయ్యగారి కార్యదీక్ష. ఎట్లయినను సరే మనతో పోరాడుటకే యతఁడు నిశ్చయమనస్కుఁడై యున్నట్లు వ్యక్తమగుచున్నది. లేదేని స్వల్పకాలములో నానకట్టను నిర్మించి యుండఁడు. అకుంఠిత ధైర్యముతో మనము సతనితో పోరాడువలయు నని సేతుపతి నుడివెను. ఆ మాటలు విని వన్నిదొర యిట్లనెను. 'ఇంతమాత్రముననే భయపడిన యుద్ధము కొనసాగు టెట్లు? దళవాయి రామప్పయ్య మహామేధావి యని నేనును విన్నాను.'

## ౭

యుద్ధము ప్రారంభ మయ్యెను. మధుర వీరులును, మఱవ సైనికులును తమ ధైర్యోత్సాహములు ప్రదర్శించు చుండిరి. "కొట్టుఁడు, చంపుఁడు, దయాదాక్షిణ్యములు చూడ వలదు–" అను నినాదములు మిన్నుముట్టెను. ఎటచూచినను హాహాకారములు చేయు యుద్ధవీరులే. రంగన్ననాయఁడు, శివరామయ్యల యాధ్వర్యమున మధుర వీరవతంసులు యుద్ధము చేయుచుండిరి. వన్నిదొర నాయకత్వమున మఱవ వీరులు వైరివీరులను ప్రతిఘటించుచుండిరి. మఱవ సైనికుల ధాకకు తట్టుకొనలేక పలువురు మధురవీరులు వీరస్వర్గము నలంకరించిరి. మఱవ సైన్యములందును విపరీతముగ నష్ట మేర్పడెను. నష్ట మేర్పడిన కొలఁదియు నిరుపక్షములవారికి నానాటికోద్రేకము కలుగుచుండెను. తత్ఫలితముగ హాహాకార ములు ద్విగుణీకృతము లగుచుండెను. అందుల కనుగుణ్య ముగ మారణహోమముగూడ సక్రమముగ జరగుచుండెను. పలువురు వీరస్వర్గము నలంకరించిరి. చాలమంది బంధింపఁ బడిరి. కొందఱు కొనయూపిరితో బాధఁజెందుచుండిరి. ఎప్పటి కప్పుడు రామప్పయ్య యుద్ధసమాచారములను తిరుమలేంద్రు నికి రహస్యవార్తాహరుల మూలమున తెలుపుచుండెను.

ఒకనాఁటి సాయంసమయమున రామప్పయ్య తిరుమల శౌరి నాయునయ్య కొక లేఖ వ్రాయించుచుండెను. రామ ప్పయ్య చెప్పుచుండగా రంగన్ననాయఁడు వ్రాయుచుండెను.

"శ్రీమత్పాండ్య మండలాధీశ్వరులు, శ్రీ మీనాక్షీ సుందరేశ్వరుల స్థిరతర కరుణాకటాక్ష సంపాదితులు నైన తిరుమలశౌరి నాయనయ్యవారి సముఖమునకు తమ ప్రధాని రామప్పయ్య అనేక దణ్ణములు పెట్టి వ్రాయించుకొన్న యుద్ధ వివరములు—

జడైకదేవ సేతుపతి యల్లుడగు వన్నిదొర సేతుపతి పక్షము వహించి మనతో పోరాడుచున్నాడు. ఇతడుకూడ సేతుపతివలె మహాసాహసుడగు యుద్ధవీరుఁడనుటలో సందేహము లేదు. మఱవ వీరులు కూడ ప్రాణము తెగించి యుద్ధము చేయుచున్నారు. వారికి బుడతకీచులు, సింహళద్వీపవాసులు సహాయము చేయుచున్న విషయమును తమకు పూర్వమే తెలిపి యుంటిని. ఇంతటి ప్రతిఘటన మున్నప్పటికిని మన సైన్యములు ధైర్యసాహసములతో పోరాడుచుండుట ముదావహము. రంగన్ననాయఁడు, శివరామయ్యల యాజమాన్యమున మనసేనలు యుద్ధము చేయుచున్నవి. మనపాళెగాండ్రును కూడ విశేషముగ సహాయము చేయుచున్నారు. అంతిమ విజయము మనకు తప్పక లభింపఁగలదని నా దృఢాభిప్రాయము. మనకు కట్టవలసిన కప్పము నెగవేసిన ప్రబుద్ధులలో కొందఱు మన సైనికులకు పట్టువడి బంధింపఁబడినారు. ఆనూర్ సంబంధ చర్కారై కూడ బంధింపఁబడినాఁడు. ఇంతవఱకు జడైకదేవుఁడు రంగములోనికి దిగలేదు. ఇంతకంటె పేర్కొనఁదగినవిషయములు లేవు.

ఇట్లు,

**దళవాయి ప్రధాని రామప్పయ్య వ్రాలు.**

కమ్మపై తన ముద్ర వేసి రామప్పయ్య యా లేఖను వార్తాహరుల మూలమున పాండ్యమండలాధిపతికి పంపెను. ఇంతలో నొక సైనికుఁడు సమీపించి, "తమ దర్శనార్థము తమిళకవి యొకరు వచ్చియున్నారు. తమ యాజ్ఞ యైనచో ప్రవేశపెట్టెదను." అనెను.

అతఁడు లోనికి రావచ్చు నని యాజ్ఞయయ్యెను. కొంత సేపటికి కవి విచ్చేసి రామప్పయ్యకు నమస్కరించెను. ప్రతినమస్కారము చేసి రామప్పయ్య యతనిని నుచితాసనమునఁ గూర్చుండ నియోగించెను.

"తమ దేయూరు?"

"ఆణూర్ పాళెము"

"అటులనా!"–అని కొంతవడి రామప్పయ్య మౌనము వహించెను.

"తమకొక విషయము నుడువ నభిలషించుచున్నాను. 'అది యప్రియముగ నుండును......'

'చెప్పుఁడు. మఱేమియు సంశయింపవలదు–'

'ఆణూర్ పాళెగారగు సంబంధ చర్కరై మహాశయుని దర్శించి పోద మని యిటకు వచ్చితిని. తమరు సమ్మతించినచో కృతజ్ఞుఁడను–'

'వారితో మాటాడవలయునా?'

'వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు తెలుప వలయును'

'కృతజ్ఞత !— దేనికి! '

'సంబంధ చర్కారై గారు తమిళ కవిపోషకుఁడు. నేను వారి యాశ్రితుఁడను. మీచే నిర్బంధింపఁ బడుటకుముందు వారిని నేను సందర్శించి నా కృతిని స్వీకరింపు మని కోరితిని. వారును సమ్మతించిరి. కాని విధివశమున వారు బంధితులైరి. మరల వారిని దర్శించితిని. నన్నుఁ జూచి వారు మిక్కిలి విచారించి, 'ప్రస్తుతము నేను సహాయము చేయ లేనిదుస్థితిలో నున్నాను. నా భార్యను చూడుఁ డని సెలవిచ్చిరి...'

రామప్పయ్య సాభిప్రాయముగా కవివైపు చూచెను.

''ఆమెను దర్శించి నా విషయము విన్నవించితిని. అప్పు డామెయొద్ద చిల్లిగవ్వయు లేదు. ఆమె దీనావస్థను గ్రహించి నేను స్వగృహోన్ముఖుఁడ నయితిని. ఆమెకూడ నా బీదతికమును గ్రహించినది. వెంటనే యా చల్లనితల్లి తన మంగళసూత్రమును తీసి నాకు బహూకరించినది...'

'అట్లనా !' సంభ్రమాశ్చర్య సంభరితుఁ డయ్యెను రామప్పయ్య.

'ఇదిగో యా బహూకృతి–' యనుచు కవి యా మంగళ సూత్రమును రామప్పయ్య కందించెను.

మాంగల్యమును చూచుచు రామప్పయ్య 'ఎవ రక్కడ' అనెను.

ఇరువురు సైనికులు ప్రవేశించిరి.

'ఆనాగర్ పాళెగా రగు సంబంధ చర్కారై గారిని వెంటనే యిచ్చటికి తీసికొనిరండు'

కొంత సేపటికి సంబంధ చక్రవర్తి వచ్చి రామప్పయ్యకు నమస్కరించెను.

రామప్పయ్య యతనిని కౌఁగిలించుకొని 'ఈ కవిగారి మూలమున మీ విషయము తెలిసినది. మిమ్ము బంధించి నందులకు విచారించుచున్నాను-' అనెను. మిక్కిలి సంతోషించి సంబంధ చక్రవర్తి "ఆజన్మాంతము మీకు కృతజ్ఞుఁడను-" అని కవి నుద్దేశించి పలికెను.

పిమ్మట రామప్పయ్య సహృదయతకు ముగ్ధుఁడై యిట్లనెను "మీరు కఠినాత్ము లనియు, స్వాభిమాను లనియు నితరులు చెప్పఁగా వింటిని. వారి మాటలు వేదవాక్యములుగా నమ్మి మీయెడ మహాపరాధము చేసితిని. మీ సహృదయతను నేఁడు గ్రహించితిని. మిక్కిలి కృతజ్ఞుఁడను-"

రామప్పయ్య మందహాసము చేసి "మీరు విన్న మాటలు కొంతవఱకు యథార్థములే. యుద్ధసమయములందు నేను తప్పనిసరిగా కఠినాత్ముఁడ నగుచుందును" అనెను.

సంబంధ చక్రవర్తి నవ్వి యూరకుండెను.

అంత కవి 'అది మీ తప్పు కాదు. మీ రవలంబించిన వృత్తి యట్టిది. అంతే కాని తమరు దయార్ద్రహృదయులు,' అని దళవాయి రామప్పయ్యను కొనియాడెను.

ఇంతలో శంఖారావము వినఁబడెను. తోడనే యెచ్చటెచ్చట నున్నవారును తమ తమ నివాసములకు పరుగులిడఁ దొడఁగిరి. రాత్రియైనచో సైనికు లందఱును తమ గుడారములయందే యుండవలయు నని యా శంఖారావము శాసిం

చును. రంగన్ననాయఁడు తన సహచరులయొద్ద సెలవు తీసి కొని తన నివాసమునకుఁ జనెను. నాఁటిరాత్రి సంబంధ చర్చలైకవితో గూడ రామప్పయ్య శిబిరమునం దుండెను.

ఆరేయి ప్రశాంతముగ గడచెను. ప్రాతస్సమయము సమీపించుచున్న దని తొలికోడి తెలియఁజేసెను. అయినను చాలమంది గుఱ్ఱులు పెట్టుచు నిద్రావస్థలోనే యుండిరి. తొలి కోడి కూఁతకే రామప్పయ్య మేల్కాంచెను. కొంతసేపు భగవ ధ్యానము చేసికొని యుద్ధ ప్రయత్నములందు నిమగ్నుఁ డయ్యెను. అంతలో రంగన్ననాయఁడును వచ్చి దళవాయిని కలిసికొనెను. ఇరువురును నాటి కార్యక్రమమును సావధాన ముగఁ జర్చించిరి. పిమ్మట రామప్పయ్య స్నానాదికమును ముగించుకొని సంధ్యావందన మొనర్చి మీనాక్షీ సుందరేశ్వ రులను సభక్తికముగ సేవించెను. పిమ్మట యుద్ధ ప్రయత్న ములలో నిమగ్నుఁడయ్యెను.

కొంచెము ప్రొద్దెక్కెను. భానుని లేఁత కిరణములు దశదిశలకు వ్యాప్తమయ్యెను. ఆహారాన్వేషణార్థము పశు పక్ష్యాదులు సంచారము మొదలిడెను. రాత్రి కురిసిన మంచుచే తడిసిపోయిన చెట్టుచేమలు సూర్యకిరణావళిలో నిగనిగ లాడుచుఁ గన్పట్టెను. నిద్రామగ్నమై యున్న సుమములు వికసించెను. సువాసన లెగ జిమ్మసాగెను. వానిని జట్టుముట్టి భృంగములు మకరందాస్వాదన మొనర్చుచుండెను. ఎంతలో నెంత చైతన్యము!

రంగన్ననాయని యాధ్వర్యమున మధుర సైనికులు యుద్ధభూమికి వెడలుచుండిరి. జడైక దేవ సేతుపతి సైన్యము లప్పటికే కదనరంగమున నుండెను. ఉభయులును యుద్ధమునకు సంసిద్ధులుగా నుండిరి. జడైక దేవుఁడు నాఁటి యుద్ధమున స్వయముగ పాల్గొను నని రంగన్ననాయనికి తెలియవచ్చెను. అతఁడు రామప్పయ్యకీవిషయమును దెలియఁజేసెను. తోడనే పాళెగాండ్రను, సేనాధిపతులను సమావేశపఱిచి దళవాయి ప్రధాని "జడైక దేవ సేతుపతి యుద్ధములో పాల్గొన నున్నాఁడని తెలియవచ్చినది. ఇది ముదావహము. నేటి యుద్ధమున నేనును పాల్గొనెదను-" అనెను. హర్షధ్వానములు మిన్నుముట్టెను. పిమ్మట నుద్రిక్తుఁడై రామప్పయ్య మాటాడసాగెను.

"జడైక దేవుఁడు మహాసాహసుఁడగు యుద్ధవీరుఁడు. మఱవవీరులు గూడ బాహుబలసంపన్నులే. ఇట్టి వీరవతంసులతో మనము నేఁడు యుద్ధము చేయుచున్నాము. పూర్వము మనము చేసిన యుద్ధము లన్నియు నొకయెత్తు. ఈ యుద్ధమొక్కటియు నొకయెత్తు. ఏలయన బుడుతకీచులును, సింహళ ద్వీపవాసులును జడైక దేవ సేతుపతికి నౌకాసహాయమే గాక సైనికసహాయముగూడ చేయుచున్నారు. అధిరులు గారుఁడు. బుడతకీచుల బలపరాక్రమములు మన కెట్టివో తెలియదుగాని మహాతంత్రజ్ఞు లని ప్రసిద్ధి వహించినారు. లేదేని ఖండాంతర వాసు లగు బుడతకీచులు మన దేశమునకు వచ్చి మఱవరాజుల యాదరాభిమానములు పొంది, వర్తక వాణిజ్యములు చేసికొనుచు, నేఁటికి మనలను ప్రతిఘటించుటకు గూడ సన్నధు

లయినారు. మన జగడములలో వ్యాపారార్థమై వచ్చెంచి యీ బుడతకీచు లెందుకు పాల్గొనుచున్నారో దురూహ్య ముగ నున్నది. ఒకవేళ వారికి మన రాజ్యమును కబళింప వలయు నను కాంక్ష కలిగిన దేమో! అమంగళము శాంతించు గాక! ఏమో–ఎవరు చెప్పగలరు! ఇంటికి వచ్చి యింటివాసాలు లెక్క పెట్టునట్టి ప్రబుద్ధు లున్నచో నా వర్గమునకు బుడత కీచులు చెందుదురేమో! నేఁడు మనకు సహాయముగ వచ్చి రేపు రాజ్యాక్రమణ చేయ సాహసింతురేమో! ఎవరు చెప్పఁ గలరు!'

హాహాకారములు చెలరేఁగెను. బుడతకీచులను చంపుఁడు, చంపుఁడను నినాదములు బయల్వెడలెను.

'ఉద్రిక్తులు కాకుఁడు. ఇంకను వినుఁడు. సింహళద్వీప వీరుల బలపరాక్రమము లెట్టివో చూడుఁడు. పూర్వము పెద కృష్ణప్ప నాయనయ్యగారి కాలములో కండిరాజునకును మన కును భయంకర సంగ్రామము జరగినది. ఆ యుద్ధములో సింహళద్వీప వీరులు చాలమంది మరణించిరి. మనకు విజయము లభించెను. కాని యుద్ధముమాత్రము ముగియలేదు. మరల కండిరాజు యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యెను. అతనికి సహాయ ముగ బుడతకీచులుకూడ యుద్ధములో పాల్గొనిరి. ఎంతమంది సహాయము చేసిన మాత్ర మేమి? అంతిమ విజయము మనకే లభించినది. అంతేకాదు, ఏస్వర్గమున నున్నాఁడో కాని దళ వాయి చినకేశవప్ప నాయఁడు కండిరాజును, కండి సైన్య మును జయించి తుదకతనిని బంధించి పాండ్యమండలాధీశ్వరుని

సమక్షమున నుంచెను. అప్పుడీ బుడతకీచు లెచ్చటికి పలా యన మంత్రము పఠించినారో దేవునికే యెఱుక! ఇట్టి వీర వతంసులు నేడు మఱవలకు సహాయముగ వచ్చినారు. మొన్న మొన్నటిదాఁక మఱవదేశమునుండి మనకు కప్పము వచ్చు చునే యుండెను. అనఁగా మఱవలు మన సామంతులుగానే వ్యవహరించుచుండిరి. నేఁటికి జడైకదేవ సేతుపతి పాండ్య మండలాధీశ్వరుని ప్రతిఘటించినాఁడు. ఇట్టి ప్రతిఘటనలు మనకు క్రొత్తవి కావు. మఱవ సైన్యముకూడ క్రొత్తది కాదు. కావున భయపడవలసిన యగత్యమేమియు లేదు. మీ ధైర్యో త్సాహములు నాకు తెలియనివి కావు. మొన్నటి యుద్ధములో ననఁగా మైసూరు యుద్ధములో - దళవాయి నంజరాజును జయించిన మీరు మఱవసైన్యములను గూడ జయింతు రని నా దృఢవిశ్వాసము. ఇంకను చేతడి యారలేదు. మీ ధైర్యము మొక్కవోలేదు. ఇంతకు మీనాక్షీ సుందరేశ్వరుల కరుణాకటాక్షములకు పాత్రుల మైన మనకు విజయము తథ్యము. సుందరేశ్వరుని మనసార ధ్యానింపుఁడు. ఆ జగజ్జన కుని నమ్మి యుద్ధము చేయుఁడు. జయము తథ్యము.''

రామప్పయ్య గంభీరోక్తులు శ్రోతలను నుద్రిక్తులుగ నొనర్చెను. బొందిలో జీవ మున్నంతవఱకు జడైకదేవ సేతు పతితో యుద్ధము చేయుటకే వా రెల్లరు నిశ్చయమనస్కు లయిరి.

యుద్ధము ప్రారంభ మయ్యెను. మహాభయంకరముగ నుండెను. ఉభయసైన్యములు హోరాహోరిగ పోరాడు

చుండెను. రామప్పయ్య, రంగన్ననాయఁడు, శివరామయ్య మున్నగువారు తమ బలపరాక్రమములు ప్రదర్శించుచుండిరి. జగ్దైకదేవుఁడు, వన్నిదొరలు మొక్కవోని ధైర్యముతో వైరివీరుల నెదుర్కొనుచుండిరి. జయాపజయములను నిర్ణయించుట మిక్కిలి కష్టముగఁ గన్పట్టెను. మధ్యాహ్న మయ్యెను. యుద్ధభూమిలో నెత్తురు కాలువలు కట్టెను. కొనయూపిరితో యమయాతన పడుచున్న సైనికు లటునిటు యుద్ధరంగమునందే పొరలాడుచుండిరి. వికలాంగు లైనహతశేషులు తమ దుస్థితిని తలపోసికొనుచు విచారించుచుండిరి. కొందఱు పిక్క బలము చూపి పాఱిపోవుచుండిరి. శత్రువీరులచే బంధింపఁబడిన యభాగ్యులు పలుబాధలకు లోనగుచుండిరి.

సాయంసమయ మయ్యెను. ఆనాఁటికి యుద్ధము విరమింపఁబడెను. మధుర సైన్యములు తమ శిబిరములకు వెడలుచుండెను. రామప్పయ్య నడవలేని స్థితియందుండెను; మిక్కిలి నీరసించి యుండెను. తలమీఁద బలమైన గాయ మొకటి తగిలెను. శరీరమున నచ్చటచ్చటఁగూడ గాయములు కన్పడుచుండెను. నెత్తుటి చారలచే దేహ మంతయు నెఱ్ఱవడి యుండెను. కాని యతని గంభీరవదనము వివర్ణము కాలేదు. సహజగాంభీర్యమునకు సైదోడుగా క్షాత్రతేజము దోబూచు లాడుచుండెను. ఇంచుమించుగ రంగన్ననాయఁడుకూడ నట్టి స్థితిలోనే యుండెను. అతఁడు తన గాయములను విస్మరించి రామప్పయ్యస్థితిని చూచి యాందోళన పడసాగెను. వారిద్దఱిని వేర్వేఱు శకటములపై నధివసింపఁ జేసిరి. పాండ్యవీరవతంసు

లా శకటముల ననుసరించి తమ తమ నివాసములకు వెడలు చుండిరి.

ఇంతలో "రామప్పయ్య యెక్కడ? చీల్చి చెండా డుదు...అతనివలన మనకీ దురవస్థ సంభవించినది...రంగన్న నాయని మాంసఖండములను గ్రద్దలకు, కాకులకు వేయుదు-" అను నినాదములు పిక్కటిల్లెను. ఒకటే రోదనము! నినాద ములు తప్ప మఱేమియు శ్రవణగోచర మగుట లేదు.

మఱవ సైన్యాధ్యక్షుఁ డగు వన్నిదొర ప్రాణాపాయ స్థితియందుండెను. అతని జీవితాంతము రేపోమాపో యన్నటు లుండెను. అతని దుస్థితి జడైకదేవుని హృదయమును కలఁచి వైచెను. తత్ఫలితముగ నతఁ డధీరుఁ డయ్యెను. ఉద్దండు లని ప్రసిద్ధి వహించిన వైద్యులను రప్పించెను. మందులు మాకులు వాడిరి. కాని యావంతయు లాభ మున్నటుల కనఁబడలేదు. మఱవ సైనికులు నిస్పృహకు లోనయి నిరుత్సాహము చెందిరి. ఒక శకటముపై వన్నిదొరను పరుండఁబెట్టి సేతుపతి నివాసమునకుఁ గొంపోయిరి. ఈ విషాద విషయమును సేతుపతి బంధువు లెల్లరికి తెలియఁజేయుటకుగాను రామనాథపురము నకు వార్తాహరులు పంపఁబడిరి. వన్నిదొరను వీడి జడైకదేవుఁ డెచ్చటికి వెడలలేదు. నాఁటిరేయి భోజనాదికమును గూడ విసర్జించెను. నిద్ర పోదమన్నను నతనికి కునుకుపట్టలేదు. అతని పంచప్రాణము లన్నియు వన్నిదొరపై నుండెను. అల్లునికి దీర్ఘాయువు నొసఁగు మని యిలువేల్పగు రామనాథ స్వామిని ప్రార్థించెను. మంత్రులు, వృద్ధులు సేతుపతికి ధైర్యము

చెప్పుచుండిరి. కాని వారు ధైర్యము చెప్పుకొలంది యతఁడు వెక్కి వెక్కి విలపింపసాగెను. ఆరాత్రి యెట్లో గడచెను.

అరుణోదయ మయ్యెను. తెరలు తెరలుగ వెలుఁగు రేకలు వచ్చుచుండెను. చీకటి క్రమక్రమముగ తగ్గుచుండెను. అప్పటికే రామనాథ స్వామివారి యాలయమున పూజాది కము ప్రారంభ మయ్యెను. నాగస్వర విద్వాంసులు మంగళ కైశికీ రాగమున మనోహరముగ నాలాపించుచుండిరి. విప్ర వరేణ్యుల వేదఘోషకూడ శ్రవణగోచర మగుచుండెను.

వన్నిదొర కాయాస మధిక మయ్యెను. సేతుపతిని తదేకదీక్షగా చూడసాగెను. జడైక దేవుఁడు ధైర్యమును గోల్పోయెను. గద్గదకంఠుఁడై 'నా-యు-నా' యనుచు వన్ని దొరపైఁ బడెను. "ఇంద్రజిత్తువని విఖ్యాతి గడించితివి. శత్రు వీరులు నిన్నుఁ జూచిన దే తడవుగా భయకంపితు లగుచుండిరి. ఆ రామప్పయ్య నీపాలిట యముఁడై దాపురించినాఁడు-అయ్యో! వంశనాశనమును కండ్లార చూడలేకున్నాను. నీవంటి బలాఢ్యుఁడు మఱియొకఁడులేడు. రామప్పయ్యనుగూడ గాయ పఱచితివి. మధుర సైనికులకు సింహస్వప్నముగా నుంటివి. నీవంటి న్యాయశీలుని, దైవభక్తుని రామనాథస్వామి తప్పక రక్షించు ననియే నేను తలఁచియుంటిని. ఈశ్వరుడుకూడ నా రామప్పయ్య పక్షము వహించినాఁడు......" అని సేతుపతి విలపించుచుండెను.

వన్నిదొరకు చికిత్స సల్పుచు రాజవైద్యులు భయ విహ్వలులై 'ప్రభూ-ప్రభూ-' అనిరి. సేతుపతికి వారిమాటలు

వినబడుటలేదు. "ఇంక నే నేమి చేయుదును. ఎంతో గారాబముగ పెరిగిన నా కుమార్తెతో నేమని చెప్పుదును-అయ్యో! రామప్పయ్య మానవుడు కాడు. మానవరూప రాక్షసుడు. దయాదాక్షిణ్యములు లేవు. దైవముగూడ నతని కేసహాయము చేయుచున్నది. దుర్విధిప్రభావ మిది" అని సేతుపతి వాపోవుచుండెను.

వన్నిదొర దేహమును సేతుపతి స్పృశించి చూచెను. ఒడలు చల్లబడియుండెను. భయభ్రాంతుడగుచు వన్నిదొరను నటునిటు కదలించెను. 'నాయనా-ఇదిగో నన్ను చూడు' మనుచు జడైకదేవుడు పలుమారులు పిలిచి చూచెను. కాని వన్నిదొర మాఱుపల్కు లేదు. అతడు గాఢనిద్రయం దుండెను. సేతుపతిని పెనుచీకటి యావహించెను. ఈ విశాల విశ్వము శూన్యముగ దోచెను. మఱవవీరులు సేతుపతి దీనావస్థను గ్రహించి విషణ్ణహృదయు లయిరి. మంత్రులు సేతుపతి నూరడించిరి.

అప్పటికప్పుడే వన్నిదొర యంత్యక్రియలకై రాజపురోహితులు సన్నద్ధు లగుచుండిరి. మంచిగంధపు చెక్కలు సేకరించిరి. రామనాథస్వామివారి యభిషేకార్థమై వినియోగింపబడిన జలముతో వన్నిదొరను స్నానము గావింపజేసిరి. ఇంతలో జడైకదేవుని కుమార్తె బంధుపరివార సమేతయై యచ్చోటికి విచ్చేసెను. ఆమెను చూచినతోడనే సేతుపతి యధీరుడయ్యెను. ఆమెను కౌగిలించుకొని విలపించెను. ఆమెకు స్పృహ తప్పెను. కొంతవడికి తెప్పరిలి, తండ్రినిచూచి

యేదో నుడువ నభిలషించెను. కాని శోకభారముచే నామె మాటాడలేక పోయెను. 'అమ్మా-నా కుడిభుజముపడిపోయినది. ఇక నా జీవితములో సంతోష మనునది యుండదు. పరమ అభాగ్యుఁడ నైతిని-' అనుచు జడ్డైకదేవ సేతుపతి దుఃఖించెను.

ఎట్లో ధైర్యము తెచ్చుకొని యామె 'నాభర్తతో సహగమనము చేసెదను...' అనెను. సహగమన మని విన్న తోడనే సేతుపతి హృదయము పలువ్రక్కలయ్యెను. సహగమనము వల దని నుడువ యత్నించెను. ఆ మాట పెదవుల వఱకు వచ్చెను. కాని యనుగతముగ వచ్చుచున్న వంశాచారము నతిక్రమించుట శ్రేయస్కరము కాదేమో యని సంశయించి మౌనము వహించెను. తదేకదీక్షగా కుమార్తెను చూడసాగెను. ఆమె తండ్రికి నమస్కరించి రామనాథస్వామి వారి యాలయమువైపు చనెను. సేతుపతి మఱేమియు మాటాడలేదు.

ఆమె రామనాథస్వామిని సందర్శించెను. సభక్తికముగ స్వామిని సేవించెను. అర్చకు లొసఁగిన తీర్థప్రసాదికమును గైకొనెను. ఆలయమునకు మూడు ప్రదక్షిణములు చేసెను. కొంతవడి కోవెలలో విశ్రమించెను. అట నున్న వృద్ధులకు నమస్కరించి యామె శిబిరమునకు విచ్చేసెను. ఆమె వినయప్రవర్తనమును చూచి వృద్ధు లాశ్చర్యచకితు లయిరి. 'ఈ సాధ్వీమణికా యిట్టి దురవస్థ! ఎంత విచిత్రము

పాపము! అప్పుడే నూఱేండ్లు నిండినవి. విధి బలీయము గదా!' అని తమ సానుభూతిని తెలియఁజేసిరి.

ఇంతలో జరగవలసిన వైదికకర్మ లన్నియు యథావిధిగ జరగెను. మేళతాళాదులతో వన్నిదొరశవము శ్మశానభూమికిఁ గొంపోఁబడెను. సేతుపతిసైన్యము శవము ననుసరించి రుద్రభూమి చేరెను. అట చితి పేర్చిరి. ఆసాధ్వీతిలకము - వన్నిదొర సహధర్మచారిణి - జడైకదేవ సేతుపతి పాదములకు నమస్కరించెను. రామనాథస్వామిని తలఁచుచు వన్నిదొరతో భర్తృసేవా పరాయణ యగు నామె సహగమన మాచరించెను. ఆమె కృతకృత్యురా లయ్యె నని యెల్లరు తలఁచిరి. వన్నిదొర దంపతులను స్వీకరించిన హవ్యవాహనుఁడు వారిని తనలో లీనము చేసికొనెను.

ఈ దృశ్యమును తిలకించుచున్న జడైకదేవ సేతుపతి గంభీరవదనుఁ డయ్యెను. ఉత్సాహభరితుఁ డయ్యెను. దుఃఖ మెచటికి పోయెనోగాని తనయెదుట నున్న మఱవ సైనికులను చూచి 'వీరవతంసులార!' అని సంబోధించెను. అవి గంభీరోక్తులు. ఎల్లరు దిగ్భ్రమ చెందిరి. జడైకదేవుఁడు స్మితవదనుఁడై యుండెను. అందఱు చకితు లయిరి. వారును దుఃఖమును విస్మరించిరి. సేతుపతి మాటాడఁదొడగెను.

"దుఃఖమును విస్మరింపుఁడు. వన్నిదొర దంపతులు వీరస్వర్గము నలంకరించినారు. వన్నిదొర సామాన్యుఁడు కాఁడు. అతని ప్రజ్ఞ యసాధారణము. అతని ధైర్యోత్సాహములు నిరుపమానములు. అతని జీవితలక్ష్యము స్వాతంత్ర్య సంరక్షణము. దేశాభిమానమే యతని జీవితాదర్శము. ఈ

యున్న తాదర్శములను క్రియారూపములో పెట్టిన కర్మవీరుఁడు మన వన్నిదొర. వన్నిదొర జీవితమే మన కందఱికి తేజోవంత మగు నుదాహరణము. అతఁ డవలంబించిన మార్గములే మన కింక శరణ్యములు. మన వన్నిదొరను బలిగొన్న రామప్ప య్యను, నతని సైన్యమును బలిగొన వలయును. అప్పుడే మనకు మనశ్శాంతి. శాంతి లేని మానవునకు సుఖము లేదు. సుఖము లేదేని శాంతి చేకూరదు. ఈ రెండును పరస్పరాశ్ర యములు. ఇవి లేకున్నచో మానవుని జీవితము జీవితముగా నుండదు. అది నరకప్రాయము. అట్టి జీవితము వాంఛ నీయము కాదు. కనుక శాంతి సౌఖ్యములను సంరక్షించు కొనుట మన విధ్యుక్తధర్మము. వీనికి విఘ్నకారులుగ నున్న వారిని చీల్చి చెండాడవలయును. కనుక రామప్పయ్యను ప్రాణములతో పోనీయఁగూడదు. అధీరులు కాకుఁడు. ఆత్మ స్వాతంత్ర్యము మఱవకుఁడు. అన్యుల యధికారమును ధిక్కరింపుఁడు. అనన్య సామాన్య ధైర్యము. అసాధారణ బుద్ధివిశేషము కలిగియున్న మిమ్ము ప్రతిఘటించిన వారికి మరణమే ధ్రువము. అందువలన నధీరులు కాకుఁడు. దైవ మును నమ్మి యుద్ధము చేయుఁడు. రామప్పయ్యను జయింపఁ గలము. శత్రువును జయించిననాడే మనకు మనశ్శాంతి; వన్నిదొరకును మనశ్శాంతి.''

'వన్నిదొరను బలిగొన్న మధురవీరులను సంహ రింతుము. దళవాయి రామప్పయ్యను సంహరింతుము. అప్పుడే మాకును మనశ్శాంతి–' అనుచు మఱవ సైనిక వీరులు హాహాకారములు చేసిరి.

# ౮

రామప్పయ్యకు వైద్యులు చికిత్స చేయుచుండిరి. రంగన్న నాయఁడు కూడ చికిత్స పొందుచుండెను. అతని గాయములు త్వరలోనే నయ మగు నని వైద్యులు నుడివిరి. వన్నిదొరమరణానంతరము యుద్ధము విరమింపఁబడు నేమో యని రామప్పయ్య తలఁచెను. కాని యట్లు జరగ లేదు. మఱవసైన్యము జగ్గైకదేవుని నాయకత్వము క్రింద మధుర సైన్యములతో పోరాడ నిశ్చయించెను. మధుర సైనికులును యుద్ధమునకు సన్నద్ధులై యుండిరి. రంగన్ననాయఁడు బల హీనముగా నుండుటచే నానాడు శివరామయ్య నాయకత్వము క్రింద పాండ్యసైన్యములు కదనరంగమునకు వెడలెను.

ఇంతలో మధురనుండి యేతెంచిన రహస్య వార్తాహరుఁ డొకఁడు రామప్పయ్యను సందర్శించి పాండ్యమండలా ధీశ్వరుని ముద్ర గల యొక చేసంచిని దళవాయి కొసఁగెను. రామప్పయ్య యొద్ద సెలవు తీసికొని యా వార్తాహరుఁడు తన బసకు మఱలెను. ఆ చేసంచిలో లేఖాద్వయ ముండెను. ఒకటి పాండ్యమండలాధీశ్వరుఁడు వ్రాసినది. మఱియొకటి వైద్య నాథయ్య వ్రాసినది. దళవాయి యభిమతానుసారము తిరుమలేంద్రుని లేఖను రంగన్ననాయఁడు చదువ దొడఁగెను.

"మీరు పంపించిన జాబు చేరినది. చాల సంతోషించితిమి. మన పాళెగాండ్రకును, సైనికులకును మా సంతోషమును తెలుపుఁడు. ఇంతకుముందే మా వార్తాహరుల మూల

మున వన్నిదొర ప్రాణాపాయ స్థితియందున్నాఁడని విన్నాము. జడైకదేవ సేతుపతి యిప్పటికైనను కప్పము చెల్లించుటకు సుముఖుఁడుగా నున్నాఁడా? సైన్యసహాయము గాని, ధన సహాయము గాని యవసరమని తోఁచినట్లయిన మాకు వెంటనే తెలుపుఁడు. ఎట్లయినను సరే సేతుపతిని లొంగదీయవలసిన బాధ్యత మీపై నున్నది. మీకును రంగన్న నాయనికిని బల మైన గాయములు తగిలినందులకు మిక్కిలి విచారించు చున్నాము. విజయలక్ష్మిని వరించి మీరు మధురకు మరలి లుదురని మా విశ్వాసము. మీ రాకను మే మందఱము నిరీ క్షించుచున్నాము. శ్రీ మీనాక్షి సుందరేశ్వరులు మనలను రక్షింతురు గాక.''

ముద్దు తిరుమలశౌరి నాయనయ్య వ్రాలు.

పిమ్మట రంగన్ననాయఁడు వైద్యనాథయ్య వ్రాసిన జాబును గూడ చదివెను.

''రామప్పయ్యను వేదోక్తముగా నాశీర్వదించి వ్రాయునది :

మీక్షేమసమాచారములు తెలిసినవి. చాల సంతో షము. ఎట్లయినను సరే సేతుపతిని జయించి తిరుమలేంద్రునికి సంతోషము చేకూర్తువు గాక! తిరుమలశౌరి నాయనిం వారు విజయోన్ముఖులై తిరిగి వచ్చు రామప్పయ్యను చూడ నభిల షించుచున్నారు. తరువాత :— మన శివాలయములో మొన్ననే కుంభాభిషేకము బహువైభవముగా జరిగినది.

చాలమంది విచ్చేసియుండిరి. నాకు తెలియకుండగనే మన శిల్పాచార్యులు నీ విగ్రహమును మండపమునందలి యొక శిలాస్తంభముపై చెక్కిరి. ఈ విగ్రహము మూర్తీభవించిన నీవలెనేయున్నది. కుంభాభిషేక సమయమున నీ విగ్రహమును చూచుచు నీవు నాయొద్ద నున్నట్లే భావించితిని. శివరామయ్య కొండప్పయ్యల క్షేమములు తెలుపవలయును. రంగన్న నాయని విచారించితి నని చెప్పుము. కుంభాభిషేకమునకు రంగన్న నాయని బంధువులెల్లరు విచ్చేసియుండిరి. వారందఱు నాకు చేదోడువాదోడుగ సహాయ మొసర్చిరి. అట్టి సహృదయుల సహకారము లభించినందువలననే నాంటి కార్యక్రమము వైభవముగా జరిగినది."

రామప్పయ్య కంతులేని సంతోషము కలిగెను. గాయములవలని బాధను గూడ విస్మరించెను. అమాంతముగ రంగన్న నాయని కౌగిలించుకొని; "చూచితివా-మా అన్నగారి జాబును. కులములు వేఱయినను మన హృదయములు మాత్రము వేఱు కావు. మీ బంధువులెల్లరు నానాడు విచ్చేసిరట!...నాయుడు!- నీ సహకారమువలననే నేనింతటి వాడ నైతిని. స్వకులస్థులే నాకు విరోధముగ పని చేయుచున్నారు. నా యభ్యుదయము వారికి గిట్టదు. ఎట్టి యన్యాయమును గాని వారికి నేను చేసియుండలేదు. అయినను వారికిని నాకును శత్రుత్వ మేర్పడినది. మన యిద్దఱివలె ఈ నాయక రాజులందఱు సంచరించినచో నీ వేళకు దక్షిణ భారత దేశ

మంతయు మన తెలుఁగువారిదే...' అనుచు రామప్పయ్య రంగన్ననాయనివైపు చూచెను.

రంగన్న నాయని వదనమున సంతోషము తాండవించెను. 'అవును. మీరు నుడివినది వాస్తవము. మన తగవులాటలను అవకాశము చేసికొనిగదా మైసూరు పరిపాలకులు మాటిమాటికి యుద్ధములు తలపెట్టుచున్నారు. అంత ఎందుకు! మన పాళెగాండ్రందఱు తిరుమలశౌరి నాయనయ్యవారికి చేదోడువాదోడుగ నున్నచో దక్షిణాపథమును సునాయసముగ జయింపవచ్చు' ననెను.

రంగన్న నాయనితో రామప్పయ్య యేకీభవించెను. పిమ్మట తిరుమలేంద్రునికిని, వైద్యనాథయ్యకును కమ్మలు రంగన్న నాయనిచే వ్రాయించి వానిని వార్తాహరుల మూలమున రామప్పయ్య మధురకు పంపించెను.

ఇంతలో శంఖారావము వినవచ్చెను. యుద్ధము ప్రారంభమైనదని రామప్పయ్య గ్రహించెను. ఎట్లో యోపిక తెచ్చుకొని రంగన్ననాయఁడు యుద్ధభూమికి పయనమయ్యెను. రామప్పయ్య కూడ లేచెను.

'మీరు విశ్రమింపుఁడు; నేను యుద్ధ సన్నాహములను గమనించి వచ్చెదను' అని రామప్పయ్యను వారించెను. 'నాయఁడు!- నేఁటి యుద్ధము భయంకరముగ నుండును...'

'ఉండ నింక - నేను శివరామయ్య...'

ఒకరి కిద్ద ఉండుట మంచిది. ఏలయన సేతుపతి క్రొత్త వ్యూహములు పన్నినాఁడని విన్నాను. వానికి ప్రతిగా మనమును పన్న వలసియున్నది——'

'అందులకే నేను యుద్ధభూమికి వెడలుచున్నాను...ఈ యొక్కనాఁడు యుద్ధమును స్మరింపకుఁడు——అది వైద్యుల యాజ్ఞ...' ఉద్రిక్తుఁడై రామప్పయ్య 'నాయఁడు!–మనకు క్రొత్త కాదుగదా యుద్ధము! ఈ గాయము లొక లెక్కా, పత్రమా? మైసూరుయుద్ధములో నీవఱకు నీ కెన్నో గాయములు తగిలినవి. యుద్ధము మానితివా చెప్పుము...'అనెను.

"నా విషయము వేఱు. తమ విషయము వేఱు. మీరు మూలఁబడినచో మే మెందులకు పనికి రాము. ధైర్యము చెప్పువారు కూడ నుండరు. నా మాట విని...తమరు..."

అనుచు రంగన్ననాయఁడు రామప్పయ్యను వారించుచుండఁగా వైద్యులేతెంచిరి. రామప్పయ్యను విశ్రమింపు మని కోరిరి. అతఁడు వారి మాటలు తీసివేయలేక పోయెను. అంత రంగన్ననాయఁడు యుద్ధభూమికిఁ జనెను.

యుద్ధము జరగుచుండెను. జడైకదేవ సేతుపతి రెండవ రుద్రుఁడుగఁ గన్పట్టెను. అతని రౌద్రాకారమే శత్రు వీరుల నధీరులుగ చేసెను. శివరామయ్య జడైకదేవుని యెత్తులకు పై యెత్తులు వేయుచుఁబోరాడుచుండెను. అంతలో రంగన్ననాయఁడు శివరామయ్యకు సహాయముగ యుద్ధమున పాల్గొనెను. శివరామయ్యకు ధైర్యము హెచ్చెను.

యుద్ధము కొనసాగెను. జడైక దేవునికి బలమైన గాయములు తగిలెను. ఆ గాయములనుండి నెత్తురు కారుచుండెను. వెంటనే యతనిని చికిత్స నిమిత్తమై శిబిరమునకు తీసికొపోయిరి. అంతలో సాయంసమయ మయ్యెను. నాటి యుద్ధము విరమింపఁబడెను. మధుర సైనికులుకూడ తమ శిబిరాభిముఖులై మఱలిరి.

రంగన్ననాయఁడు మిక్కిలి నీరసించి యుండెను. యుద్ధమును గమనించు నుద్దేశముతో యుద్ధరంగమునకు రంగన్ననాయఁడు వెడలియుండెను. కాని జడైక దేవుని రౌద్రాకారమును చూచినంతనే శివరామయ్యకు సహాయముగ నతఁడు యుద్ధమునఁ బాల్గొనెను. అందువలన మఱింత నీరసించి యుండెను. రెండుమూఁడు రోజులవఱకు రంగన్ననాయఁడు శయ్యనుండి లేవఁగూడదని వైద్యులు నుడివిరి. అతని స్థితిని చూచి రామప్పయ్య విషణ్ణహృదయుఁ డయ్యెను. వైద్యులు రంగన్ననాయని వేయికండ్లతోఁ జూచుచుండిరి.

వన్నిదొర విగతజీవుఁ డైన నాఁటినుండి జడైక దేవ సేతుపతికి ధైర్యము తగ్గసాగెను. ప్రక్కబలములేమి నతఁడు నిరుత్సాహమునకు లోనయ్యెను. 'ఇంక నాకు దిక్కెవ్వరు? ఎండలో నున్న నీడకు రమ్మనువా రెవరున్నారు? వన్నిదొర సహాయము లేకుండ నే నీ యుద్ధమున జయింతునా?' అను నైరాశ్యభావము లతని నావహించి పీల్చి పిప్పి చేయఁ దొడఁగెను. మానసికముగా సేతుపతి నుడువ నలవి కాని బాధకు వశుఁ డయ్యెను. యుద్ధఫలితముగ శారీరక బాధకుఁ గూడ

లోనయ్యెను. సహాయముగ వచ్చిన బుడత కీచులును, సింహళ వీరులును విశేషసాహాయ్య మొనర్చిరి. కాని వారి సహాయము నిరర్థక మయ్యెను. మఱవ సైనికులలో చాల మంది వికలాంగు లయిరి. వారి దనావస్థను చూచిన సేతుపతి హృదయము శోకార్ణవ మయ్యెను. ఏమి చేయుటకును తోఁచలేదు. జడైక దేవుని స్థితిని మఱవవీరులు గ్రహింపక పోలేదు. యుద్ధము వల దనిన ప్రభు క్రోధాగ్నికి గుఱి కావలసివచ్చు నేమో యని వారు భయావహు లయిరి.

నాఁటిరేయి ప్రశాంతముగఁ గడచెను. ఉదయ మయ్యెను. నాఁటి యుద్ధమునకు వలయు సన్నాహములలో రెండు పక్షములవారును నిమగ్నులై యుండిరి. రామప్పయ్యకు బాధ కొంత తగ్గియుండెను. రంగన్ననాయఁడు చికిత్స పొందుచుండెను. శివరామయ్యకు సహాయముగ రామప్పయ్య ససైన్యముగ యుద్ధరంగమునకు వెడలెను. మఱవసైన్యముతో జడైక దేవ సేతుపతి యుద్ధభూమికి వచ్చి యుండెను. యుద్ధ మారంభ మయ్యెను. సేతుపతితో యుద్ధము చేయుటకు తొలుత మధురవీరులు కొంచెము వెనుకాడిరి. అంతిమవిజయ మతనికే లభించు నేమో యని రామప్పయ్య తలఁచెను. అధీరులై యున్న తనసైనికులకు ధైర్యము చెప్పి చూచెను. అంతమాత్రముతో తృప్తి చెందక రామప్పయ్యయే ముందునకు వచ్చి సేతుపతిని ప్రతిఘటించెను. మధుర వీర నికాయము ధైర్యము తెచ్చుకొని దళవాయి రామప్పయ్యకు కుడిభుజముగ నిలిచెను. దళవాయి బాహుబల సంపన్నత్వ

మును గాంచి సేతుపతి దిగ్భ్రమ చెందెను. 'నేటికి గదా తగిన ప్రతి వీరునితో యుద్ధము చేయుచున్నా'నని తలఁచి రామప్పయ్యను జయింపవలయు నని నిశ్చయ మనస్కుఁ డయ్యెను. బుడత కీచులును, సింహళ ద్వీపవీరులును వారిరువురి పోరాటమును జూచి 'రామప్పయ్య సేతుపతివంటి వీరవతంసులు సమైక్యముగ నున్నచోఁ బాశ్చాత్యులకు భారతావనిలో నిలువ నీడకూడ లభింప'దని గ్రహించిరి.

అంత కంతకు రామప్పయ్య రుద్రుఁ డగుచుండెను. అతని యాకృతి మఱవవీరులకు భయంకరముగ తోఁచెను. మధుర సైనికులు కొదమసింగములవలె వైరి వీరులపైకి దుముకుచుండిరి. మఱవ సైనికులకు ధైర్యోత్సాహములు సన్నగిల్లెను. వారిలోఁ బెక్కుఱు వీరస్వర్గము నలంకరించిరి. హత శేషులలో చాలమంది యధీరులై తమ నిస్సహాయతను వెలిబుచ్చుచుండిరి. సేతుపతి యప్పటికే మిక్కిలి నీరసించి యుండెను. పండ్ల బిగువుతో నతడు యుద్ధము చేయుచుండెను. ఇఁక లాభము లేదనుకొనెను. కాని యా భావమును ప్రస్ఫుటము చేయకయే గంభీరముగ నుండెను. అపజయము తథ్యమని గ్రహించినను జడ్డైకదేవ సేతుపతికి దళవాయి రామప్పయ్యపై క్రోధము తగ్గలేదు. అధీరుఁ డగుచున్నకొలఁది కోపము ద్విగుణీకృత మగుచుండెను. దళవాయిని సంహరించి తీఱవలయు ననియే యతఁడు నిశ్చితాభిప్రాయుఁ డయ్యెను.

ఇంతలో సాయంసమయ మయ్యెను. సూర్యుఁడు పడమటికొండ యందలి మబ్బులలోనికిఁ జనెను. అంబరవీథి

కాషాయాంబరమువలెఁ గన్పట్టెను. విహంగములు విశ్రాంతార్థమై తమతమ నెలవులకు వడివడిగఁ బరుగు లిడుచుండెను. ఆనాఁటి యుద్ధము విరమింపఁబడెను. జయ జయ ధ్వనులు సలుపుచు మధురవీరులు తమ శిబిరములకు మఱలిరి. తన దుర్విధిని చింతించుకొనుచు జడైకదేవ సేతుపతి ససైన్యముగ యుద్ధభూమి వీడెను.

ఆ రేయి జడైకదేవునికి నిద్దుర పట్టలేదు. మంత్రి పుంగవులతోఁ గూడ మనసిచ్చి మాటాడలేదు. అతని హృదయము రామప్పయ్య మరణవార్తను వినుటకఁ దహ తహ లాడుచుండెను. 'కాని రామప్పయ్యకే జయము లభింప నున్నది. ఎవరిసహాయము నే నపేక్షింతును?' అని జడైకదేవ సేతుపతి యాలోచనానిమగ్నుఁడై యుండెను.

ఇంతలో నొక దళవాయి 'ప్రభూ' యనుచు సేతుపతిని సమీపించెను.

పరధ్యానముగా 'నా కేమియు వలదు. పొమ్ము' అనెను.

'ప్రభూ—నేను దళవాయిని...'

'మీరా!' అతనిని కూర్చుండ నియోగించి 'విశేషములు కలవా?' అని సేతుపతి ప్రశ్నించెను.

'విశేషము లేమియు లేవు...తమ రెందుకో పిలిపించినారఁట'

'అవును మఱచితిని...'

కొంతతడవు మౌనము వహించెను. సహజ గంభీరస్వర ముతో 'ఎవరక్కడ' అనెను.

తోడనే సేనాపతి యంగరక్షకు లిరువురు ప్రవేశించి యతని యాజ్ఞకై నిరీక్షించిరి.

'ముఖ్యమంత్రిగారితో నేము పిలుచుచున్నానని చెప్పుఁడు'

'చిత్త' మనుచు యంగరక్షకులు వెడలిరి.

'దళవాయీ!—మన వీరవరేణ్యులు చాలమంది వీర స్వర్గము నలంకరించి నందులకు నా హృదయము దుఃఖ శోకపూరిత మయినది. నిష్కారణముగ వారందరు నా యొక్కని నిమిత్తమై ప్రాణత్యాగము చేసిరి...' అనుచు సేనాపతి విలపింపసాగెను. 'ప్రభూ! తమకు నేను చెప్పునదేమి కలదు. అవసరము వచ్చినప్పుడు రాజ సేవాధురంధరులు శరీరత్యాగముగూడ చేయవలసియుండును. ఇది వీరవతంసుని విధ్యుక్తధర్మము. ఈ ధర్మమునకు బద్ధులైన మహానీయులే నిజమైనవీరులు. ప్రభుసేవాపరాయణులును...' అని దళవాయి సవినయముగఁ బలికెను.

'అవును. నీవు చెప్పినది వాస్తవము కాదనను. మనకు జయము లభించినచో మనకష్టము ఫలోన్ముఖమై నట్లుగా భావింపవచ్చును. స్వర్గమునందలి వీరవరేణ్యులకును మనశ్శాంతి చేకూరును. మఱి ప్రకృతము రామప్పయ్యకే జయము లభింప నున్నదిగదా—ఏమి చేయుదము?'

దళవాయి మౌనము వహించెను.

ఇంతలో మంత్రిముఖ్యుఁడు వేంచేసి సేతుపతికి నమస్కరించి యొక యుచితాసనముపై నాసీనుఁ డయ్యెను. అతఁడు వయోవృద్ధుఁడు. సేతుపతి ప్రతినమస్కార మొనర్చి యిట్లనెను.

"మీ సహకారసానుభూతులవలననే మారాజ్యము నేఁటిదాఁక సుస్థిరముగ నున్నది. రాజ్యమునం దెల్లెడల శాంతి భద్రతలు నెలకొల్పుటకును మాకు వీలయినది. పలుమారులు శత్రువీరులనుండి దేశమును సంరక్షింపఁ గలిగితిమి. నేఁడు మనకు పరీక్షాసమయము సమీపించినది. పూర్వపు యుద్ధములన్నియు నొకయెత్తు. ఈ యుద్ధ మొక్కటియు నొకయెత్తు. ఏమందురేని బుడతకీచులు, సింహళవీరులు, కొచ్చిన్ వీరులు—మున్నగువారు మనకు సహాయము చేయుచున్నను రామప్పయ్యకే జయము లభింపనున్నది. ఈ తెలుఁగువీరులు కొఱుకరాని కొయ్యలుగ నున్నారు. ఒకరిని మించి మఱియొకరు యుద్ధము చేయుచున్నారు. రంగన్ననాయనితోఁ బోరాడుట మిక్కిలి కష్టముగ నున్నది. పోని, యీ యువకుఁ డగు శివరామయ్యతో యుద్ధము చేయుటకును కష్టముగానే యున్నది. ఇఁక మనవారిని గమనింతము. మన వీరవరేణ్యులు తెలుఁగువారి కెందులోను తీసిపోరు. కాని దుర్విధిప్రభావ మిట్లున్నది. లేదేని సింహబలుఁ డగు వన్నిదొర యింత త్వరలో మరణించునా!"

సేతుపతి కన్నులలో నీరు సుడిగుండమువలె తిరుగం జొచ్చెను.

'శివరామయ్య వయసువాండే గదా మన వన్నిదొర- అప్పుడే వన్నిదొరకు నూరేండ్లు నిండవలయునా?...ఎట్లో యీ విచారమును దిగమ్రింగి గుండె రాయి చేసికొని మరల యుద్ధమునకు దిగితిని...లాభము చేకూరక పోంగా ననేకులను నాపాడు పొట్టం బెట్టుకొంటిని. ఇప్పు డేమి చేయుదము? నా కేమియు తోంచుట లేదు' అనుచు జడైకదేవుండు విల పించెను.

జడైకదేవుని దీనావస్థను దళవాయి చూడలేక పోయెను. మంత్రి మౌనము వహించి కొంతతడవు దీర్ఘా లోచనా నిమగ్నుం డయ్యెను. పిమ్మట నిట్లనెను.' ప్రభూ— అధీరులు కాకుండు. పడినగోడలు పడిన ట్లుండునా? ప్రకృ తము రామప్పయ్యగారు లేవలేని స్థితిలో నున్నారం డని మన రహస్యవార్తాహరుల మూలమున విన్నాను...'

'అటులనా!' సేతుపతికి చెప్ప నలవి కాని సంతోషము కలిగెను.

'అవును ప్రభూ— మొన్ననే రామప్పయ్యగారు పర సించి యుండిరి. అసలే వయసు చెలినవారు...'

'ఎండిపోయిన మొక్కకు తమరు నీరు పోయుచున్నారు – అని సేతుపతి నవ్వెను. మంత్రియు దళవాయియు నవ్విరి. సేతుపతితోపాటు దళవాయి గూడ ధైర్యము వహించెను. 'ఇంకొక విషయము. రంగన్ననాయుండు, శివరామయ్య

మున్న గువారు రామప్పయ్యను కంటిని ఱెప్పవలె సంరక్షించు చున్నారు. లేకున్నచో రామప్పయ్యస్థితి ప్రమాదకరము గానే యుండును—' అని మంత్రి యనెను.

'కనుక నిప్పు డేమి చేయుద'మని సేతుపతి ప్రశ్నించెను. 'రామప్పయ్యగారు జీవించి యున్నంతవఱకు మన యాట లేమియు సాగవు. బాహుబలమునకుఁ దోడుగ బుద్ధి బలము గూడ రామప్పయ్యగారియం దున్నది...'

'అవును-యథార్థము పలికితిరి' అని దళవాయి యనెను. 'కనుక నే రామప్పయ్యగారిని సంహరించుట తేలిక పని కాదు. మన మెన్ని వ్యూహములు పన్నినను వానికి ప్రతి వ్యూహములు పన్నుచున్నాఁడు. ఇప్పటికే మన వారిలో చాలమంది నిహతు లయినారు. హతశేషులలోఁ బలువురు యుద్ధము చేయలేనిస్థితిలో నున్నారు...'

'యుద్ధమును విరమించినచో?' అని సేతుపతి ప్రశ్నించెను. సచివప్రవరుఁడు కొంత తడవు యోచించి 'యుద్ధ విరమణము హాస్యాస్పదముగ నుండునేమో' అనెను.

'ముమ్మాటికిని నవ్వులాటగానే యుండును'

'అయితే...రామప్పయ్య సంహారమున కొక్కటే మార్గము కనఁబడుచున్నది—' అని గంభీరముగ ముఖ్యామాత్యుఁడు పలికెను. సేతుపతికిఁ బోయినప్రాణము తిరిగి వచ్చినట్లుండెను. అతని వదనము సూర్యుని దర్శించిన తామర పూవువలె వికసించెను. పట్టపగ్గాలు లేని సంతోషముతో 'ఆమార్గ మేమిటో?' అని ప్రశ్నించెను. 'ప్రభూ ! తమకు

తెలియని దేమి యున్నది ? రామప్పయ్యను సంహరించుట సులభసాధ్యము కాదు. అందులోను రంగన్ననాయఁడు, శివరామయ్యలు సజీవులై యుండఁగ రామప్పయ్యను హతమార్చుట కలలోనివార్త. మన కా రామప్పయ్యగారు జీవించి యున్నంతవఱకు దినదినగండముగానే యుండును. అందువలన రామప్పయ్యగారిని సంహరించుటయే మనకు శ్రేయస్కరము. ప్రస్తుతము మిగిలియున్న యీ సేనతో మనము రామప్పయ్యగారిని జయింపలేము...'

జడైకదేవ సేతుపతి మంత్రివైపు తదేకదీక్షగాఁ జూడ సాగెను.

'కొచ్చిన్ వీరులలోఁ గొందఱు మంత్రశాస్త్రజ్ఞులునారని విన్నాను. వారి మంత్రములకుఁ దిరుగు లేదని మనవారు చెప్పినారు...'

సేతుపతి రౌద్రాకారము దాల్చెను. నయనములు విస్ఫులింగము లయ్యెను. శరీరము కంప మొందెను.

'చాలు చాలు మీ మాటలు : నాలో వేఁడి నెత్తురింకను ప్రవహించుచునే యున్నది. జవసత్త్వము లుడిగి పోలేదు. దొడ్డిదారులు త్రొక్కుట వీరుని లక్షణము కాదు. మీరు సహాయము చేసినను సరే. చేయకున్నను సరే. రామప్పయ్యతో యుద్ధము చేసెదను. జయాపజయములతో నాకుఁ బని లేదు. నా ధర్మమును నేను నిర్వహించెదను. ఏదో వయోవృద్ధులు గదా యని మీ సలహా నపేక్షించితిని. యోచన చేసి చేసి కడపట మంచి యుపాయము చెప్పితిరి...'

అని నిజ మయిన వీరునివలె గంభీరముగ మాటాడి సేతుపతి లోనికిఁ జనెను.

జడైక దేవుని గంభీరోక్తులను విని దళవాయి చకితుఁ డయ్యెను. బెల్లము కొట్టిన ~~ యిగా మాటుపోయెను. మంత్రి మందహాసము చేయుచు 'దళవాయి' యనెను. అమాత్యుని మందహాసమును చూచి దళవాయి మఱింత చకితుఁ డయ్యెను. అతని కంతయు నగమ్యాగోచరముగ నుండెను.

దళవాయి భుజముపై చేయి వైచి 'ఏపాటి వీరుఁడవు నీవు! నాలుగుమాట లనెనో లేదో యందులకే భయభ్రాంతుఁడ వైతివి. ఇట్టి వాఁడవు యుద్ధము చేసి రామప్పయ్యగారిని జయింతువు కాఁబోలు' అని మంత్రి హాస్యోక్తు లాడెను.

దళవాయి తల వంచి మిన్నకుండెను. మరల మంత్రి యిట్లనెను. "మన ప్రభువుగారి మాటలు నాకు క్రొత్తవి కావు. అట్టి మాటలు విని నాచెవులు చిల్లులు పడినవి. అరు చ్యము లైన మాటలు చెవిని పడినచో వారు తుల నే యను చుందురు. కాని మనవంటి ప్రభుసేవాపరాయణు లామాట లను సరకు సేయకూడదు. ఎట్లయినను సరే వారిని మనము సంతుష్ట హృదయులుగ చేసి మనమును మనశ్శాంతి పొందవలయును. ఇది రాజసేవాపరాయణుని ధర్మము. లేదేని నే నీముఖ్యమంత్రిపదవికి వచ్చియుండలేను. నీవు చిన్నవాఁ డవు. అనుభవము లేదు నీకు. బాహుబలముతోఁబాటు లోక జ్ఞానమును గూడఁ బొందుటకు యత్నింపుము...'

ముఖ్యమంత్రి మాటలు దళవాయి కప్రియములుగ నుండెను. జడ్డైకదేవుని గంభీరోక్తు లింకను నాతనికి వినఁబడుచుండెను. 'ఆపత్సమయములోను ధర్మానువర్తియై సంచరించునట్టి మహనీయుఁడు సేతుపతి' అని జడ్డైకదేవుని లోలోన ప్రశంసించెను.

'రామప్పయ్యగారిని జయించుటకు నీవును యుద్ధము చేయుటకే యంగీకరింతువా?' అని ముఖ్యామాత్యుఁడు ప్రశ్నించెను. ఆ ప్రశ్న తన్ను గేలి చేయుచున్న దని దళవాయి తలఁచెను.

'అవును—ముమ్మాటికి యుద్ధము చేసియే తీరుదును. రాజాజ్ఞను శిరసావహించుటయే రాజభక్తుని కర్తవ్యము--' అని దళవాయి గంభీరముగ నుడివెను. 'పిన్నలకుఁ బెద్దల మాటలు రుచ్యములు కావు. తమకుఁ దోచిన రీతిగాఁ జేసి కడపట విచారింతురు. అడుసు త్రొక్క నేల కాలు కడుగ నేల!' అనుచు మంత్రి పరుషోక్తు లాడసాగెను.

దళవాయి యుద్రిక్తుఁడై యిట్లనెను. 'యుద్ధములో నేను మరణించినను సరే యుద్ధము చేసి తీరుదును. నామిత్రు లెందఱో స్వదేశ సంరక్షణార్థము శరీరత్యాగము చేసి యుండఁగా నే నొక్కఁడను మాత్రము జీవించి యున్నచో లోకులు నన్నుఁ బరిహసింతురు. ఆ పరిహాసమునకుఁ బాత్రుఁడ నగుటకంటె వీరస్వర్గము నలంకరించి చిరయశస్సు గడించెదను. ఇది నా నిశ్చితాభిప్రాయము. ఇఁక సెలవు-' అనుచు దళవాయి నాలుగడుగులు ముందునకు వేసెను.

'ఒక సహాయము మాత్రము చేయుము'

'తప్పక చేసెదను—'

'ఇక్కడ విన్న మాటలను నీలోనే యుంచుకొనుము. ప్రసంగవశమునఁ గూడ నన్నుగూర్చి యొక్కమాటయైనను పలుకవలదు—ఈ మాత్రము సహాయము చేసిన మిక్కిలి కృతజ్ఞుఁడను!'

'నేను సజీవుఁడనుగ నున్నచో మీరు భయపడ వలయును!'

'ఆఁ!'

'నావలన తమ కేమియు విపత్తు వాటిల్లదు.' అనుచు దళవాయి ముందునకు సాగెను.

దళవాయిని చూచుచు మంత్రి శిలావిగ్రహ మయ్యెను. అతఁడు కొంతసేపటికి తనలో తా ని ట్లనుకొనెను. 'ఈ విధముగ ప్రగల్భములు పలుకువారి నెందఱినో చూచియుంటిని. వీరివలనఁ గలుగులాభము రవంతయు లేదు. కొచ్చిన్ వీరవతంసులకు నా యభిప్రాయమును తెలియఁజేసి వారి సమ్మతిని పొందెదను. కార్యసానుకూల్యమే నాకు కావలసినది.'

దళవాయి ప్రధాని రామప్పయ్య మూసినకన్ను మూసినట్లుగాఁ బడియుండెను. తలపై బలమైన గాయ మొకటి తగిలియుండెను. వైద్యులు మందుమాకు లనేకములు వాడుచుండిరి. భూతవైద్యులు కొందఱు విభూతి మంత్రించుచుండిరి. ఎవరికిఁ దోఁచిన యుపాయములు వారు వారు నుడువుచుండిరి. శివరామయ్య, కొండప్పయ్యలు దళవాయి కిరువైపుల నాసీనులై

వైద్యులు నుడివిన ప్రకారముగా నుపచారములు సలుపు చుండిరి. సైనికని కాయము విచారములో మునిఁగి యుండెను. అన్నపానాదికమును గూడ విసర్జించెను. కావున నాఁటి యుద్ధము విరమింపఁబడెను.

రంగన్ననాయని పరిస్థితియు నాందోళనకరముగనే యుండెను. కాని యతఁ డెట్లో యోపిక తెచ్చుకొనుచు విచార సాగరమున మునిఁగియున్న సహచరులకు ధైర్యము నుడువు చుండెను. రామప్పయ్యకు దీర్ఘాయువు నొసఁగు మని మీనాక్షీసుందరేశ్వరులను మనసారఁ బ్రార్థించు చుండెను. అపుడపుడు యుద్ధమును గూర్చి శివరామయ్యతో సమాలోచనము జరపుచుండెను.

ఉన్నటులుండి యొక్కసారిగా రామప్పయ్య శిబిరము నుండి నినాదములు మిన్ను ముట్టునట్లుగ వినవచ్చెను. రంగన్న నాయఁడు భయభ్రాంతుఁ డయ్యెను. రామప్పయ్యకు విపత్తు వాటిల్లె నేమో యని యతని హృదయము కలఁతఁ జెందెను. అతనికీ విశాలవిశ్వము శూన్యముగా తోఁచెను. ఓపిక తెచ్చు కొని మంచమునుండి లేచెను. అంగరక్షకులు వల దని వారించుచున్నను వారిని లక్ష్యము సేయక రంగన్ననాయఁడు రామప్పయ్య నివాసమున కభిముఖుఁడై రెండడుగులు వేసెను. అంతలో నవ్వుమొగముతో శివరామయ్య రంగన్ననాయని సమీపించెను.

'రామప్పయ్యగారికి క్షేమమే గదా ?'

శివరామయ్య సదుత్తరము నొసఁగెను.

అప్పటికి రంగన్ననాయనికిఁ బోయిన ప్రాణము తిరిగి వచ్చిన ట్లనిపించెను. మరల మంచముపై పరుండి సాభిప్రాయముగ శివరామయ్యను చూచెను. 'ఈ విశేషము మీ చెవిని పడెనో లేదో! సేతుపతి యుద్ధసన్నాహములు విరమించి దొడ్డిదారులు త్రొక్కుచున్నాఁడఁట—'

రంగన్ననాయఁడు సంభ్రమాశ్చర్యములు ప్రకటించి 'జడైకదేవసేతుపతి మహావీరుఁ డని విన్నాను. అతఁడెట్టివారిని కూడ లక్ష్యము చేయనట్టి మహాస్వాభిమాని యని మనసైనికులు చెప్పిరి. ఈ విషయములు సత్యదూరములు కావనియే నేనును నమ్మియుంటిని. అతఁడు నిజమయిన వీరుఁడే యైనచో దొడ్డిదారులు త్రొక్కవలసిన యగత్యమే యుండదు గదా! అతని చుల్లుఁడు వన్నిదొరవలె జీవమున్నంతదాఁక శత్రువులతో పోరాడి వీరస్వర్గము చేరవలయును. ఇది వీరధర్మము. ఇప్పటికి జడైకదేవుని నిజస్వరూపము బయటపడినది. ఇఁక మనము కూడ వేయికండ్లతో సేతుపతిని గమనించుచుండవలయును. జాగు చేసినచో మనకు ముప్పు వాటిల్లును' అనెను.

'అవును. నా యభిప్రాయము కూడ నదియే. మన సైనికు లెల్లరు మఱవ సైనికులను వెన్నంటి తిరుగుచు నెప్పటి కప్పుడు క్రొత్తక్రొత్తవార్తలు సేకరించుచు మనకుఁ దెలియఁ జేయుచున్నారు'

ఇంతలో నొక సైనికుఁ డేతెంచెను. అతని మోము వివర్ణమై యుండెను. ఏదియో నుడువ నభిలషించెను. కాని

భయవిహ్వలుఁ డగుటచే మాట లతనికిఁ దడబడుచుండెను. ఆ సైనికుని దురవస్థను చూచినంతనే రంగన్ననాయనికి ముచ్చెమటలు పోసెను. శివరామయ్య హృదయము శోకార్ణవ మయ్యెను.

'దళవాయి ప్రధానిగారు మిమ్ము వెంటనే రమ్మనుచున్నారు' అని సైనికుఁడు రంగన్ననాయని నుద్దేశించి నుడివెను.

తోడనే శివరామయ్యతోఁ గూడి రంగన్ననాయఁడు రామప్పయ్య నివాసమునకుఁ జనెను.

రామప్పయ్య మిక్కిలి నీరసించియుండెను. మాటాడుటకుఁ గూడ శక్తివిహీనుఁడై యుండెను. అతని సువిశాల వదనమండలమునందలి సహజగాంభీర్యము కొంచెముగాఁ దగ్గియుండెను. కాని యతని హృదయము వైరివీరులను చీల్చి చెండాడవలయు ననియే తత్తరపడుచుండెను.

రంగన్ననాయఁడు దళవాయిని సమీపించినంతనే యతనికి సవినయముగ నమస్కరించెను. చేసైగ చేసి రంగన్ననాయని తన ప్రక్కనే కూర్చుండు మని రామప్పయ్య కోరెను. శివరామయ్య దళవాయి పాదసన్నిధిని నాసీనుఁ డయ్యెను. రంగన్ననాయఁడు దళవాయి స్థితిని చూచి యప్రయత్నముగా కంటఁ దడిఁ బెట్టెను; మాటాడలేకపోయెను. శివరామయ్య ధైర్యముఁ గోల్పోయి విచారసాగరమున మునిఁగెను.

రామప్పయ్య రంగన్ననాయని భుజముపై చేయి వైచి నిమురుచు మెల్లగ నిట్లనెను. 'పిచ్చివాఁడా—కంట తడిఁ బెట్ట

కుము. 'సాహసే లక్ష్మీః' అనుచు ముందడుగు వేయవలయును. ఇది వీరవరేణ్యుని లక్షణము. కంటఁ దడిబెట్టుట మనకు శ్రేయస్కరము గాదు. ధైర్యముగా నుండుము. మిన్ను విఱిగి మీఁద పడినను సరే యధీరుడఁవు కాకుము'' అని నుడువుచు రామప్పయ్య పెద్దగా దగ్గెను. కొంచెము నెత్తురు క్రిందపడెను. రంగన్ననాయఁడు విషణ్ణహృదయుఁ డయ్యెను. తెరలు తెరలుగా వెలుపలికి వచ్చు శోకమును దిగమ్రింగి తనశూన్య దృష్టులను దళవాయిపై కేంద్రీకరించెను. శివరామయ్య శోక విహ్వలుఁ డయ్యెను. రామప్పయ్య మాటాడ నెంచెను. కాని శక్తి విహీనుఁ డగుటచే మౌనము వహించెను.

కొంతసే పయ్యెను. శోకభారము నడఁచికొని, 'ఇంక మాకేది పెద్దదిక్కు—' అని రంగన్ననాయఁడు విలపించెను.

ఓపిక తెచ్చుకొని రామప్పయ్య 'నాయఁడు' అనెను. ఎల్లరు దళవాయివైపు చూచిరి.

'నీ వేమియు దుఃఖింపవలదు. నామాట వినుము. జగ్గైకదేవునితో సమరము సాగించి జయశ్రీని వరింపుము. నావలన నీతై నంతవఱకు ప్రయత్నించితిని. ఆరంభించిన కార్యము నిశ్శేషముగా ముగియవలయును గదా! కావున జయలక్ష్మిని వరించు భారము నీపై నున్నది. ఈ గురుతర బాధ్యతను నిర్వర్తించిన పిమ్మటనే వేఱొక పనిని తల పెట్టుము. ఇది నా యభిమతము. అంతే కాదు. ఇది నాయాజ్ఞ. దీనిని విస్మరింపకుము.' అని దళవాయి పలికెను.

మరల నతఁడు దగ్గెను. ఆయాసము ప్రారంభ మయ్యెను. వదనమునందలి గాంభీర్యము కొంచెము కొంచెముగా తగ్గఁ జొచ్చెను. కాని పూర్తిగా వివర్ణము కాలేదు. వైద్యులు తల్లడిల్లిరి. రంగన్ననాయఁడు ధైర్యము గోల్పోయెను. మధుర సైనికు లెల్లరు రామప్పయ్యను సందర్శింప గుమి గూడిరి. ఒక్కని మొగమునఁ గూడ నెత్తుటిచుక్క లేదు. జాతిబొమ్మల వలె నిశ్చేష్టులై నిలువఁబడి రామప్పయ్యను చూచుచుండిరి.

ఇంతలో నొక రహస్యవార్తాహరుఁడు భయవిహ్వలుఁడై గుమిగూడియున్న సైనిక సమూహమును త్రోసికొనుచు రామప్పయ్యను సమీపించెను. గద్గదకంఠుఁడై 'సేతుపతి యాజ్ఞకు బద్ధులై కొచ్చిన్ వీరులు కొందఱు దళవాయి గారికి చేతబడి చేసినారు' అనెను.

రంగన్ననాయఁడు పెద్దపెట్టున విలపింపఁ దొడఁగెను. శివరామయ్య దళవాయి పాదములపై వ్రాలి దుఃఖింప నారంభించెను. సైనికు లెల్లరు విచారసాగరమున మునిఁగిరి. కొంత సేపయ్యెను. మధుర వీరులు శోకమును దిగమ్రింగి యుద్రేకముతో 'సేతుపతిని చంపుఁడు, చంపుఁ'డనుచు మిన్నుముట్టునట్లుగా నినాదములు చేసిరి. శంఖము లూఁదిరి. అప్పటి కప్పుడే యుద్ధసన్నాహములలో నిమగ్నులయిరి. సైనికులు ప్రదర్శించిన ధైర్యోత్సాహములకు ముగ్ధుఁడైన రంగన్న నాయనికి గూడ ధైర్యము వచ్చెను.

'కొచ్చిన్ వీరులను చీల్చి చెండాడుఁడు. ఇక మీఁద దయాదాక్షిణ్యములు చూడవలదు. మన ప్రధానామాత్యుల

వారిని మంత్రశక్తిచే చంపఁదలఁచిన సేతుపతికిఁ దగిన ప్రాయశ్చిత్తము చేయవలయును.' అని రంగన్ననాయఁడప్రయత్నముగ నుడివెను. వీరవరేణ్యుల యుత్సాహము ద్విగుణీకృతమయ్యెను. అంతు లేనికోలాహలము !

ఈ కోలాహలమును చూచిన రామప్పయ్య కొంచెము విసుగుఁ జెందెను. ఓపిక తెచ్చుకొని తన సైనికులను చూచి మాటాడ సాగెను. "ఇఁక నా జీవితము ముగియనున్నది. అనఁగా-ఇహలోకము నుండి విముక్తిఁ జెందెదను. నన్ను గుఱించి దుఃఖింపకుఁడు. మీ ధర్మమును సక్రమముగా నిర్వర్తింపుఁడు. మీలో చీము నెత్తురు లున్నంతవఱకు మన ప్రభువులు తిరుమలశౌరి నాయనిం వారికి సహాయము చేయుఁడు. మన దేశసంరక్షణకై యహోరాత్రములు పాటుబడుఁడు. ఇది వీరవతంసుల మైన మన ధర్మము. మీనాక్షీసుందరేశ్వరులు రక్షింతురు గాక."

ఇటుల రామప్పయ్య మాటాడుచుండఁగ, "నేను నిరపరాధిని. నా కేమియు తెలియదు. నన్ను చంపకుఁడు" అను కేకలు శ్రవణగోచరము లయ్యెను.

మఱుక్షణములో బంధితుఁడై యున్న యొక వీరుఁడు రామప్పయ్య సన్నిధికిఁ దీసికొని రాబడెను. 'ఏమియుఁ దెలియని నన్ను క్షమింపుఁ' డనుచు బంధితుఁడు దళవాయికి సవినయముగ నమస్కరించెను. రామప్పయ్య యభిమతానుసారము బంధితుని బంధములు సడలింపఁ బడెను.

'నేను నిష్కారణముగ బంధింపఁబడితిని. నాకు మంత్ర శాస్త్రములోఁ బరిచయము రవ్వంతయు లేదు...' అని బంధితుఁ డనుచుండఁగ 'ఈ మాటల కేమి గాని చేతబడి చేసిన దెవరో చెప్పు' మని రంగన్ననాయఁడు గద్దించి యడిగెను. అతఁడు భయపడుచు 'నా కేమియు తెలియదు. ఒక మలయాళ మంత్రజ్ఞుఁడు చేసినాఁడు' అనెను.

ఎల్లరు కొంతసేపు మౌనము వహించిరి.

మలయాళ మంత్రములకు తిరుగు లేదని విన్నాను. ఇప్పు డేమి చేయుద మని శివరామయ్య నుద్దేశించి రంగన్న నాయఁ డనెను.

"అవును. మలయాళ మంత్రజ్ఞుఁడు లభించిన బాగుగ నుండును. మంత్రశాస్త్రములో వారు సిద్ధహస్తులు."

"మనవారిలో మంత్రశాస్త్రజ్ఞు లెవరైన నున్నారేమో—తొలుత విచారించి చూతము. నీయభిప్రాయము?"

"అటులనే కానిండు."

తోడనే మంత్రశాస్త్రజ్ఞునికై యన్వేషణ సాగించిరి.

రామనాథస్వామివారి యాలయపరిచారకులలో నొకఁడు మంత్రశాస్త్రములో మహాఘుటికుఁ డని రంగన్న నాయనికిఁ దెలియవచ్చెను. వెంటనే యతనిని బిలువ నంపించెను. రామప్పయ్య దుస్థితిని వివరముగ నా మంత్రజ్ఞునికి తెలిపిరి.

అతఁడు మిక్కిలి జాలి చెంది సేతుపతి దుర్ణయమును నిరసించెను. కాని తాను జద్దైకదేవుని భృత్యుఁడ ననియు,

యజమానికి ద్రోహము సలుపుట న్యాయరహితకార్య మనియు నా పరిచారకుఁడు నుడివి మిన్నకుండెను. రంగన్న నాయఁడు హతాశుఁ డయ్యెను. ఆ పరిచారకుని బాధించుట శ్రేయస్కరము గాదని తలఁచి యతనిని విడిచి పుచ్చి మఱి యొకనికై యన్వేషణ సాగించిరి. కాని లాభము లభ్యము కాలేదు.

ఇంతలో రామప్పయ్య కాయాస మధిక మయ్యెను. మందు మాకులు వల దనెను. మంత్రతంత్రములు కూడ దనెను. రంగన్ననాయఁడు నిస్పృహఁజెంది యిఁక దేనివలననులాభము కలుగఁబో దని తలఁచి రామప్పయ్యకు సపర్యలు చేయసాగెను. శివరామయ్య కేవలము శిలావిగ్రహమువలె కొయ్యబారి పోయెను. కొండప్పయ్య కన్నీరు మున్నీరుగా నేడ్వసాగెను.

ఉన్నటులుండి యొక్కసారిగ దళవాయి పెద్దగ దగ్గెను. మరల దగ్గెను. ఆయాస మధిక మయ్యెను. రంగన్ననాయఁడు, శివరామయ్య, కొండప్పయ్య-దళవాయికి సమీపముగ నాసీను లయిరి. వారిని రామప్పయ్య తదేకదీక్షగఁ జూచెను. 'మీ రెల్లరు సఖ్యముగా నుండి దేశమును సంరక్షింపుఁ డని హీన స్వరముతో నుడివి కొండప్పయ్య బుజముపై చేయి వైచెను. పిమ్మట శివరామయ్య, రంగన్నల చేతులు కలుపుచు (శ్రీ) మీనాక్షీసుందరేశ్వరులు...' అనెను. అర్ధోక్తి యందే దళవాయి ప్రధాని రామప్పయ్యమాట పడిపోయెను. దేహమును తాకి చూచిరి. చల్లఁబడి యుండెను.

మధుర సైనికులు దుఃఖాక్రాంతు లయిరి. రోదనము తప్ప మఱేమియు వినఁబడ లేదు.

దళవాయి ప్రధాని రామప్పయ్య మరణవృత్తాంతము తిరుమలశౌరి నాయనయ్యకు తెలియఁజేయఁబడెను. అతఁడు కన్నీరు మున్నీరుగా విలపించెను. ఒక్క క్షణములో మధురా నగరమున రామప్పయ్య మరణవృత్తాంతము వ్యాపించెను. మధుర పౌరులు శోకవిహ్వలు లయిరి. వైద్యనాథయ్య దుర్భర శోకపూరితహృదయుఁ డయ్యెను. తిరుమలేంద్రుఁడు స్వయముగ రామప్పయ్య భవనమునకుఁ జని వైద్యనాథయ్య నాదరించెను. ఇరువురును శోకార్ణవమున మునిఁగియుండుటచే మాటాడలేకపోయిరి. కొంచెము ధైర్యము తెచ్చుకొని "ప్రభూ! మీరు దుఃఖింపకుఁడు. విధి బలీయ మని పెద్దలు నుడువుదురు గదా" యని వైద్యనాథయ్య పలికెను.

'రామప్పయ్యగారి మరణముతో నా కుడిచేయి పడిపోయిన ట్లున్న' దనుచు తిరుమలశౌరి విలపింపసాగెను. దళవాయి పూర్వవిరోధు లగు మంత్రివరేణ్యులు కూడఁ బశ్చాత్తప్తహృదయులై "మాకు పెద్ద దిక్కు కరవైనది" అనుచు దుఃఖించిరి.

పిమ్మట రామప్పయ్య గృహమునందే మంత్రి పుంగవులతో భావి కార్యక్రమమునుగూర్చి తిరుమలేంద్రుఁడు కొంతతడవు చర్చించెను. తత్ఫలితముగ సేతుపతితో యుద్ధము కొనసాగించి యతనికి తగిన ప్రాయశ్చిత్తము చేయవలయు ననియే తిరుమలశౌరి నిశ్చయమనస్కుఁ డయ్యెను. ఈ విష

యమును వార్తాహరుల మూలమున దళవాయి రంగన్న నాయనికిని, శివరామయ్యకును తెలియఁజేసెను.

పాండ్యమండల దళవాయి ప్రధాని రామప్పయ్యకు పారలౌకిక క్రియలు యథావిధిగ శివరామయ్యచే జరపబడెను. రామనాథస్వామివారి యాలయమునందలి యర్చకులు పౌరోహిత్యము వహించిరి. దళవాయి రామప్పయ్యకు పారలౌకిక క్రియలు జరగుచున్నంతసేపు మధుర వీరవతంసు లెపు డెపుడు జడ్డైకదేవ సేతుపతిని సంహరించి రామప్పయ్య యాజ్ఞను నిర్వర్తింతుమా యని తత్తరపడసాగిరి. రంగన్ననాయఁడును సేతుపతితో యుద్ధము కొనసాగించుటకే నిశ్చితాభిప్రాయుఁడై యుండెను. అంతలో తిరుమలేంద్రుఁడు పంపిన వార్తాహరులు రంగన్ననాయని సమీపించి పాండ్యమండలాధీశ్వరుని యాజ్ఞను తెలియఁజేసిరి.

పాండ్య మండలాధీశ్వరుని నిశ్చితాభిప్రాయమును మధుర సైనికనికాయము సహర్షముగ స్వీకరించెను. తోడనే హాహాకారములు చెలరేఁగెను. శంఖారావములు, నగారా మ్రోఁతలు మిన్ను ముట్టెను.

దళవాయి రామప్పయ్య మరణానంతరము శోకార్ణవమున మునిఁగియున్న మధుర సైనికులు తిరిగి యుద్ధ సన్నాహములలో నిమగ్నులు కారనియు, యుద్ధము సమాప్తమగుననియు జడ్డైకదేవ సేతుపతి తలఁచియుండెను. అతని తలఁపులు పగటికల లయ్యెను. నవోత్సాహముతో మధురసైనిక వర్గము దళవాయి రంగన్న, శివరామయ్యల యాధ్వర్యము

క్రింద ముందడుగు వేయుచుండుటను చూచి జడైకదేవుఁడు దిగ్భ్రమఁ జెందెను. సేతుపతి సైనికులు చకితులయిరి. రెండవ రుద్రునివలెఁ గనఁబడుచున్న శివరామయ్యను జూచి భయ భ్రాంతు లయిరి. జడైకదేవ సేతుపతి కొంతతడవు మంత్రి మండలితో సమాలోచనము జరపి యుద్ధసన్నాహములందు నిమగ్నుఁ డయ్యెను.

రామప్పయ్యను సంహరించినందులకు ప్రతీకారవాంఛ మధుర సైనికులలో మసలుచున్న దని సేతుపతి గ్రహించెను. తొలుత భయవిహ్వలుఁ డయ్యెను. జయము లభ్యము కాదేమో యని శంకించెను. కాని ధైర్యము తెచ్చుకొని యుద్ధరంగమునకుఁ జనెను.

మరల యుద్ధ మారంభ మయ్యెను. రంగన్ననాయఁ డొకవైపునుండియు, శివరామయ్య మఱొక వైపునుండియు, కొండప్పయ్య యింకొక వైపునుండియు సేతుపతి సైన్యములను ప్రతిఘటించిరి. సేతుపతి యాజ్ఞానుసారము మఱవ సైన్యము కూడ మూఁడు విభాగములుగ విభజింపఁబడెను. జడైకదేవుఁడు శివరామయ్యతోఁ బోరాడసాగెను. ప్రతీకార వాంఛ శివరామయ్యను వెన్నంటి తిరుగుచునే యుండెను. సేతుపతిని చూచుకొలఁది శివరామయ్యకు దేహముపై తేళ్లు, జెఱ్ఱులు ప్రాకుచున్న ట్లనిపించెను. నుదుర నలవి కాని యావేశమునకు వశంవదుఁ డగుచుండెను. ఎప్పు డెపుడు సేతుపతిని సంహరింతునా యని యతఁడు త త్తరపడ సాగెను.

రామప్పయ్యమాట స్ఫురణకు వచ్చినప్పు డెల్ల నతని హృదయము శోకపూరిత మగుచుండెను.

మొక్కవోని ధైర్యముతో సేతుపతి కూడ పోరాడుచుండెను. కాని రంగన్ననాయఁడు వైరివీరులను నిశ్శేషముగ సంహరించుచుండెను. సేతుపతి ధైర్యము గోల్పోయెను. మఱవవీరులు జడైక దేవుని దీనావస్థను చూచి సహింపలేక దుఃఖసముద్రమున మునిఁగిరి. కాని చేయునది లేక యుద్ధము విరమింప నభిలషించిరి. సహాయముగా వచ్చిన బుడతకీచులును, కొచ్చిన్ వీరులును, సింహళ ద్వీపవాసులును, లజ్జాపరవశులై వచ్చిన త్రోవలు పట్టిరి.

సేతుపతి సైన్యము పలాయనమంత్రము పఠించుటను చూచి మధురవీరులు పెద్దగ నవ్వఁదొడఁగిరి. వారి సంతోషమునకు మేరయే లేదు. 'దారి తెన్ను తెలియక కాలుగాలిన పిల్లుల వలె దిక్కు లేని పక్షు లెటకో యెగిరి పోవుచున్నవి.' అని విజయోత్సాహముతో కొందఱు మధురవీరులు హాస్యోక్తు లాడిరి. 'పాపము వా రేమి చేయుదురు! మనవలె వారును తమ ప్రభు భక్తిని వెలిబుచ్చిరి' అని కొందఱు తమ సహానుభూతిని ప్రదర్శించిరి. మఱి కొందరు జడైక దేవుని నానా విధముల పరిహాసము లాడిరి. 'ఉట్టి కెక్కలేని పెద్దమ్మ స్వర్గము నెక్క ప్రయత్నించిన ట్లున్నది. తమ్ముని తన యదుపాజ్ఞలో నుంచుకొనలేని సేతుపతి మనతో యుద్ధము చేయుచున్నాఁడు. తెలుఁగు వారనిన నెంత నిరసనభావము! తగిన ప్రాయశ్చిత్తము జరిగినది. ఎంతమంది రాజులు మన మహా

రాజులుంగారికి సామంతులై కప్పములు కట్టుట లేదు! వారందఱికంటె సేతుపతి గొప్పవాఁడా యేమి? గొప్పవాఁ డనియే యనుకొందము. యుద్ధము చేసి మన రామప్పయ్యగారిని చంపలేకపోయెను గదా!... చేతబడి! ......సాహసుఁ డగు యుద్ధవీరుఁడు చేయవలసిన పని యిదేనా! యుద్ధము చేసి వైరిని చీల్చి చెండాడవలయును. లేదా వీరస్వర్గము నలంకరింపవలయును. అన్యాయముగ రామప్పయ్యగారిని సంహరించినందులకు సేతుపతికి తగిన పరాభవము జరిగినది.'

ఆ నాఁడు రంగన్ననాయఁడు శివరామయ్యతోఁ గూడి చాలసేపు మంతనము లాడెను. తత్ఫలితముగ సేతుపతిని పాండ్య మండలాధీశ్వరుని సమక్షమున నుంచుటకు నిశ్చయించెను. పిమ్మట వారిరువురు రామనాథస్వామి వారి యాలయమునకుఁ జనిరి. ఆలయాధికారులు వారికి స్వాగత వచనములు పలికిరి. సామవేదము నభ్యసించు లేఁబ్రాయపు కుఱ్ఱ లిద్దరు సామగానము చేసి రంగన్న శివరామయ్యల యాదరాభిమానములు చూఱగొనిరి. రంగన్ననాయఁ డా బాలకులను సముచితరీతిని సంతృప్తులం జేసెను. స్వామి వారి ప్రసాదమును స్వీకరించి వారిద్దఱు తమ నివాసముల కరిగిరి.

నాఁటి రేయి మధుర వీరవతంసులు విజయోత్సాహముతో మధురానగరాభిముఖులై పయనము సాగించిరి. రంగన్ననాయఁడును, శివరామయ్యయు వేర్వేఱు శకటములం దధివసించిరి. జడ్డైక దేవ సేతుపతిని కూడ నొక ప్రత్యేక

శకటమున తీసికొని వెళ్లిరి. అతనిని గూర్చి పల్లెత్తు మాట యైనను పలుకవల దని రంగన్ననాయఁడు సేతుపతితో నున్న మధురవీరుల నాజ్ఞాపించెను. తదాజ్ఞను వారు సహర్షముగ తలఁ దాల్చిరి.

రామనాథపురమును సమీపించి నంతనే జడైకదేవ సేతుపతి హృదయము శోకార్ణవ మయ్యెను. 'నిన్న మొన్నటిదాఁక నీ ప్రాంతమునకు పరిపాలకుఁడుగా నున్న నేను నేఁడు బంధితుఁడనై నా రాజ్యమును చూచుచున్నాను. శత్రువులచేఁ జిక్కి నా ప్రజ లెట్టి కష్టములకు గుఱి యగు చున్నారో గదా! ఇప్పుడు వారికి నే నేమి సహాయము చేయుదును! పనికిమాలినవాఁడ నై పోతిని. అయ్యో! నా ప్రజలు న న్నేమనుచున్నారో? మరల నా రాజ్యమును తనివిదీర కన్నార చూచు భాగ్యము నా కున్నదో లేదో!'' అని యతఁడు చాలసేపు విచారించెను.

సేతుపతి తమ్ముఁడు తంబి కూడ నొక శకటమునం దధి వసించి మధురకుఁ బ్రయాణ మయ్యెను. అతని సంతోషము నకు మేర లేకుండెను. తప్పక రామనాథపురము తన హస్త గత మగు నని యతఁడు మధురస్వాప్నికజగత్తులో విహారము చేయుచుండెను.

పాండ్య మండలాధీశ్వరుఁడు ముద్దు తిరుమలశౌరి నాయకేంద్రుఁడు, జైత్రయాత్ర సలిపి గృహోన్ముఖు లయిన వీరవతంసుల నాహ్వానింప నభిలషించి వారిరాకను నిరీక్షించు చుండెను. మంత్రులు, సైనికోద్యోగులు, పురప్రముఖులు

చాలమంది గుమిగూడియుండిరి. కాని దళవాయి రామప్పయ్య మరణవార్త తిరుమలేంద్రుని హృదయమును కలచి వైచు చుండెను. విధి బలీయ మనుచు వైద్యనాథయ్య పాండ్య మండలాధిపతికి ధైర్యము నుడువుచుండెను.

ఇంతలో రంగన్ననాయఁడు, శివరామయ్య, సేతుపతి మున్నగువా రెల్లరు ప్రత్యేక శకటములలో విచ్చేయుచున్నా రని వార్తాహరుల మూలమున తిరుమలశౌరి తెలిసికొనెను. కప్పము చెల్లింప నిరాకరించిన జడైకదేవుఁడు బంధితుఁడై వచ్చుచున్నాఁడని తెలిసికొన్నంతనే మధురపౌరులు మిక్కిలి సంతసించిరి. రామప్పయ్యగారి ప్రాణములు బలిగొన్న మల యాళ మంత్రజ్ఞులను గూడ చూడవలయు నని పురప్రముఖు లభిలషించిరి. రంగన్ననాయఁడు, శివరామయ్య—మున్నగు దండనాథుల గుణగణములను చెప్పుకొనుచు వారిని సంస్తు తించిరి.

శరవేగమున వచ్చుచున్న యీ యాశ్వికశకటములు దృష్టిగోచరము లయ్యెను. మధురానగరవాసుల కెక్కడలేని సంతోషము కలిగెను. జడైకదేవ సేతుపతిని జయించిన వీర వతంసుల కెపుడెపుడు సుస్వాగతము చెప్పుదుమా యని వారు తహతహలాడిపోవుచుండిరి. శంఖము లూఁదిరి. భేరీలు మ్రోగిం చిరి. మంగళవాద్యములఘోష మిన్ను ముట్టెను. కాని తిరు మలేంద్రునికి శోకభార మధికమగుచుండెను. గుండెనిబ్బరము చేసికొనియున్న వైద్యనాథయ్య కూడ విచారవదనుఁడై

యుండెను. రామప్పయ్యను ద్వేషించిన మంత్రిపుంగవులు కూడ నెందులకో గాని విచారపడనులై యుండిరి.

ఆశ్వికశకటములు జనసమూహమును సమీపించెను. తోడనే రంగన్ననాయఁడు, శివరామయ్య మున్నగువారు 'ప్రభువులు వేంచేసియున్నా' రనుచు శకటములనుండి దిగి పాండ్యమండలాధీశ్వరునికిని, వైద్యనాథయ్యకును నమస్కరించిరి. మధురవీరవతంసులు జయజయధ్వానములు చేసిరి. విజయధ్వానములతో శ్రుతి కలుపుచు మదగజములు ఘీంకారమొనర్చెను. గుఱ్ఱములు సకిలించెను. ఈ ఘీంకృతులును హేషలును మిన్ను ముట్టెను. తిరుమలేంద్రుఁడు వీని కన్నిటికి బధిరుఁడై యుండెను. రామప్పయ్య మరణవార్తయే యతని హృదయమును అంపపుకోఁత పెట్టుచుండెను. కొంతవడికిఁ గన్నీరు మున్నీరుగా విలపింపసాగెను. శివరామయ్య నయనము లశ్రుపూరితము లయ్యెను. తల్లిని గోల్పోయిన వత్సము వలె రోదనము చేయుచు రంగన్ననాయఁడు వైద్యనాథయ్యను కౌఁగిలించుకొనెను. రామప్పయ్యపై రంగన్ననాయనికిఁ గల విశేషగౌరవము తిరుమలశౌరినాయని స్మరణకు వచ్చెను. 'నాకును రంగన్న నాయనికిని గల మైత్రిలో శతాంశ మైనను మీ నాయకరాజులం దున్నచో మిమ్ము ప్రతిఘటించుటకు ఫాలాక్షునకుఁ గూడ శక్యము గాదు—' అని యప్పుడప్పుడు రామప్పయ్య పలుకు పలుకులు తిరుమలేంద్రుని హృదయాంబరమున మెఱపుల వలె మెఱసెను. తోడనే యతని వదనము ప్రకాశవంత మయ్యెను. నయన

ములు సవ్యభావములను విరజిమ్మెను. తిరుమలశౌరి యుత్సాహభరితుఁ డయ్యెను.

పిమ్మట రంగన్న నాయని యొక్కయు శివరామయ్య యొక్కయు చేతులు కలుపుచు పాండ్యమండలాధీశ్వరుఁడు సహజగంభీరస్వరముతో నిట్లనెను. 'నాకును రంగన్న నాయని కిని గల మైత్రిలో శతాంశ మైనను మీ నాయక రాజులం దున్నచో మిమ్ముఁ బ్రతిఘటించుటకు ఫాలాక్షునకుఁ గూడ శక్యము గాదని రామప్పయ్యగారు మా శ్రేయస్సును గోరి చెప్పు చుండెడివారు. వారి మాటలు యథార్థములు. రామప్పయ్యగారు లేని కొఱఁతను శివరామయ్య తీర్చు చున్నాఁడు. మీ రిరువురును సఖ్యభావముతో సంచరించుచు పాండ్యమండల పురోభివృద్ధికి శ్రమింపుఁడు. రామప్పయ్యగారి దివ్యసందేశము కూడ నిదియే.'

ప్రభునాజ్ఞను దండనాథు లిద్దఱును సహర్షముగ స్వీక రించిరి.

అటుపిమ్మట యుద్ధములో సహాయ మొనర్చిన పాళె గాండ్రు, వీరవరేణ్యులు – మున్నగు ప్రభుసేవాపరాయణుల కెల్లరకు తిరుమలశౌరి నాయనయ్య తన కృతజ్ఞతఁ దెలిపెను. ఇఁకముందు కూడ మాకు సహాయము చేయుచు రాజ్యము నం దెల్లెడల శాంతి భద్రతలు సంరక్షింపుఁ డని తిరుమల నాయకేంద్రుఁడు పాళెగాండ్ర నందఱిని కోరెను. వారు తమ యంగీకారమును సవినయముగఁ దెలిపిరి.

అది సంజవేళ. ఎండదొర పడమటి కొండకుఁ బయన మయ్యెను. మసకచీఁకటి నలుమూలల నలముకొనెను. కడుపు కూటికై ప్రొద్దు సమానము నేల నాలుఁగు చెఱఁగులు తిరిగిన పులుఁగులు, పిట్టలు చెట్లుచేమలు చేరుకొనుచుండెను. కడు పార మేఁత మేసి తెల్లని నుఱుగులు గ్రక్కుచు పొలముల నుండి యాలమందలు తమ నెలవులకు మఱలెను. కోడె దూడలు చిలిపిగంతులు వేయుచు నటు నిటు పరుగు లిడు చుండెను. వానిని బట్టుకొని తెచ్చి మందలోఁ జేర్చునప్పటికి పసుల కాపరులకు ముచ్చెమటలు పోయుచుండెను. గంతు లిడునపుడు కోడెదూడల మెడలలో నున్న సరిమువ్వ గజ్జెల దండలు ఘలుఘల్లు మని మ్రోఁగుచుండెను. వీనులకు విందొన రించుచున్న యా గజ్జెల మ్రోఁతకు మొగము వాచిపోయిన కొందఱు కొంటె కోణంగులు కోడెదూడలతో పాటు పరుగు లెత్తుచుండిరి. పోట్లావులు కొన్ని మందలోఁ జేరక మారాము చేయుచు దగ్గఱికి వచ్చినవారిని కుమ్ముచుండెను. ములుకోలను చూచినంతనే కొన్ని కుక్కిన పేలవలె మందలోఁ జేరు చుండెను. 'మేము వచ్చుచున్నాము. కుడితినీళ్లు, జనపకట్టలు, కసవు, ఉడికించిన యులవలు సిద్ధము చేయుఁడు–' అని తెలియఁ జేయుటకో యన్నట్లుగా నెద్దు లంకెలు వేయుచుండెను. కసవు మోపులు నెత్తిపై నిడికొని కమ్మనిపాటలు పాడుచు వయసు నెలఁతలు తమ నెలవులకుఁ బోవుచుండిరి. ఆ పడుచులను పసుల కాపరులు కొందఱు గేలి చేయుచుండిరి. అందులకు మాఱుగా వారు పసులకాపరులను నవ్వుటాలచే నెగతాళి

పట్టించుచుండిరి. అక్కజము! కోపమే రాదు. పై పెచ్చు పెద్ద పెట్టున నవ్వుకొనుచుండిరి. తమ మేలును చూచుకొనక పరులమేలుకై చెమట లోడ్చుచు సేద్యము సాగించు నా పెద్ద మనసు గల నాగేటి దొరలు మాటలాడుకొనుచు నిండ్లకు వడివడిగా నడచుచుండిరి.

చతుర్వేదమంగల మందలి శివాలయమున సాయం కాలపు పూజ జరగుచుండెను. గుడిగంటలు గణగణ మ్రోఁగుచుండెను. నాగస్వర విద్వాంసులు మధురమనోహరము, రసభరితము నగు నొకపాట వాయించుచుండిరి. కొంత సేపటికి పూజ ముగిసెను. పిమ్మట దేవునికి నివేదనము చేసిన ప్రసాదమును నర్చకులు ముముక్షువుల కొసఁగుచుండిరి.

గుడి మంటపమున నొకవైపు పండితు లొకరు శంకరభాష్యము చదువుచు వ్యాఖ్యానము చేయుచుండిరి. మఱొకవైపు శ్రీమదాంధ్ర మహాభారతమును చదువుచుండిరి. ఒకవైపు తిరుక్కురళ్ పద్యములు పఠించుచుండిరి. ఒకమూల వేదవిద్యావిశారదుఁ డగు నొక పండితుఁడు ఛాత్రమండలితోఁ గూడి వేదాధ్యయన మొనర్చుచుండెను. మంటపము సహస్రకంఠములతో మాఱుమోఁగుచున్నట్లనిపించెను. వృద్ధులు కొందఱు వేదాంతవిషయములు చర్చించుచుండిరి. కొందఱు యువకులు వేదాధ్యయన పద్ధతిని తిలకించుచు తన్మయత్వము చెందుచుండిరి. మఱికొందఱు కవిత్రయమువారిని స్తుతించుచుండిరి. పుణ్యాంగనలు కొందఱు శ్రావ్యముగఁ బాటలు పాడుచుండిరి. బాలబాలిక లాటలలో మునిఁగియుండిరి.

కోవెలయందున్న వారెల్లరు సంతోషముగ నుండిరి. కాని యొక్క వ్యక్తి మాత్రము సంతోష రహితుఁడై యుండెను. ఏకాంతముగ నాసీనుఁడై యాతఁడు తనలోఁ దాను మాటాడుకొనుచుండెను. చుట్టుప్రక్కల నున్న వారిని గూడ నతఁడు కన్నెత్తియైనను చూచుట లేదు.

ఎందులకో గాని యతఁడు లేచెను. అతఁడు దృఢకాయుఁడు. విశాల మగు వక్షస్థలము. గంభీర మగు వదనము. నాలుఁగు వ్రేళ్లకు సరిపడు నెన్నుదురు. కొట్టవచ్చు చూపులు. అతడు మంటపమును సమీపించెను. మంటప స్తంభములు వివిధచిత్రములచేఁ జిత్రితములు. ఒక స్తంభమును సమీపించి యచటనే యతఁ డాగిపోయెను. ముకుళితహస్తుఁడై యా స్తంభమునఁ జెక్కఁబడిన విగ్రహమును చూచుచు నతఁడు నిశ్చేష్టుఁ డయ్యెను.

ఇంతలో భారతకథాశ్రవణము చేసికొని యొక పుణ్యాంగన మంటపమును వీడి వెలుపలికి వచ్చెను. ఆమె వెంట నొక బాలుఁ డుండెను. అతని దృష్టి శిలా స్తంభము నందలి విగ్రహమునకు ప్రదక్షిణము చేయుచున్న యా దృఢశరీరునిపైఁ బడెను.

'అమ్మా—ఇదుగో చూడు' అనెను.

ఆమె కుమారుని వైపు తిరిగెను.

'గుళ్లో వున్న దేవుడికి ప్రదక్షిణం చెయ్యకుండా యీ బొమ్మకు ప్రదక్షిణం చేస్తున్నా డేమిటి?'

చేతులు జోడించి యామె యా విగ్రహమునకు నమస్కరించెను.

'ఆ బొమ్మను చూసి నువ్వుకూడా దణ్ణం పెడుతున్నా వెందుకు ?'

'ఆ బొమ్మ ఎవరిదో తెలుసా నాయనా - దళవాయి ప్రధాని రామప్పయ్య గారిది. నువ్వుకూడా దణ్ణం పెట్టు—'

బాలుఁడు రామప్పయ్య విగ్రహమునకు నమస్కరించి యా వృద్ధకాయునివైపు చూడసాగెను.

బాలుని భుజముపై చేయి వేసి 'నాయనా - రోజూ యీ విగ్రహానికి నమస్కరిస్తూ వుంటే నువ్వుకూడా గొప్ప వీరుడవవుతావు తెలిసిందా-' అని యతఁడనెను. ఇంతలో నర్చకులు విచ్చేసి యతనిని పుష్పమాలాలంకృతుని గావించి గుడిలోనికిఁ దీసికొని పోయిరి.

అతఁడు దిండుగల్లు పాళెగారు. బాహుబల సంపన్నుఁడు సచ్ఛీలుఁడు దేశసేవాపరతంత్రుఁడు నగు దళవాయి ప్రధాని రామప్పయ్యగారి మిత్రరత్నము. శ్రీమత్పాండ్య మండలాధీశ్వరుఁడు, మేరుసమాన ధైర్య యశస్తిలకుఁడు, కవిపండిత పోషకుఁడు నగు ముద్దు తిరుమలశౌరి నాయనయ్య వారి యాదరాభిమానములు చూఱగొన్న వీరవతంసము. జగదేకవీరుఁ డని విశేషవిఖ్యాతి సముపార్జించిన మహనీయమూర్తి.

అతఁడే దళవాయి రంగన్ననాయఁడు.

# ఈ గ్రంథరచనమునం

# దీ క్రింది గ్రంథములు సంప్రతింపఁబడినవి

ఆంగ్లము :

మధురనాయకరాజుల చరిత్ర

(శ్రీ ఆర్. సత్యనాథ అయ్యర్)

శ్రీ రంగాచార్యులుగారి వ్యాసములు

(ఇండియన్ ఆంటిక్వేరి 1916 సం॥)

తెలుఁగు :

తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర

(శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే ప్రకటితము)

సింహళద్వీప చరిత్ర

(శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారిచే ప్రకటితము)

తమిళము :

రామయ్యన్ అమ్మానై

(తంజావూరు సరస్వతీమహాలు పుస్తక భాండాగారమువారి యాజ్ఞ మాన్యమున మదరాసు ప్రభుత్వమువారిచే ప్రకటితము)

మదురై త్తలవరలాఱు

(శ్రీ రాఘవయ్యంగారుగారుచే పరిష్కృతము)

ఏతద్గ్రంథకర్తలకును, పరిష్కర్తలకును కృతజ్ఞుఁడను. ఈ సందర్భమున దళవాయి రామప్పయ్య యను నా వ్యాసమును (జూన్, 1952) ప్రకటించిన 'భారతి' సంపాదకులకును నా కృతజ్ఞతను తెలుపుకొను చున్నాఁడను.

